# దిలీపు బృందం

## పిక్నిక్ వెళ్లారు



























JWTUC 1614


LIFEBUOY
for health
ఇప్పుడు, సొగసైన కొత్త రూపులో!



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

మితిమీరిన ధనాశ మనిషిని ఎలాంటి స్థితికి దిగజారుస్తుందో, ఈ సంచిక లోని, "తలవంచినవాడు" అన్న కథ రుజువు చేస్తుంది. షావుకారు, తనది కాని బంగారుకాసు కోసం నేల చూపులు చూడటం అలవరుచుకుని, అపహాస్యం పాలయాడు.

"సాహసికురాలు" అన్న కథలో సాహసానికి తోడు—వివేకం, సమయస్ఫూర్తీ కూడా వుంటే, ఎంతెంతేసి ఘనకార్యాలు చేయవచ్చునో తెలుస్తుంది,

రాబోయే సంచిక దీపావళి ప్రత్యేక సంచికగా ఎక్కువ పేజీలతో వెలువడుతుంది. అందులో మామూలుగా ఉండే కథలు గాక, పదహారు పేజీల రంగులబొమ్మల కథా, ఎనిమిది పేజీల కార్టూను కథా అధికంగా వుండగలవు.

సంపుటి : 37 - అక్టోబర్ 1965 - సంచిక : 4

CHITRA



# భారత చరిత్ర




షాజహాఁ 1657 లో జబ్బుపడే నాటికి అతని నలుగురు కొడుకులూ బాగా పెద్ద వాళ్ళే—దారాషుకోహ్ (43), షుజా (41), ఔరంగజేబు (39), మురాద్ (33). వీళ్ళు కాక ఆయన కిద్దరు కుమార్తె లుండే వారు; పెద్దది జహఁఆరా దారాషుకోహ్ పక్షం, రెండోది రోషనారా ఔరంగజేబు పక్షం.

అందరిలోకీ తండ్రికి ఆత్మీయుడు దారా. అతనే తన అనంతరం రాజ్యానికి రావాలని షాజహాఁ కోరిక. దారా మతం విషయాలలో ఉదార భావం కలవాడు; వేదాంతమూ, బైబిలూ, సూఫీ గ్రంథాలూ చదివాడు. అతను బ్రాహ్మణపండితుల సహాయంతో అథర్వవేదాన్నీ, ఉపనిషత్తులనూ పర్షియను భాష లోకి అనువదింప జేశాడు.

రెండవవాడు షుజా బెంగాలుకు గవర్నరుగా ఉండేవాడు. అతను తెలివిగలవాడూ, యుద్ధంలో పరాక్రమం కలవాడు అయిన మాట నిజమే కాని, మితిమీరిన భోగలాలసత్వం మూలంగా అతనికి కార్యదీక్ష, మెలకువా ఉండేవి కావు. నాలుగోవాడు మురాద్ గుజరాతు గవర్నరు. అతను నిష్కపటీ, ఉదారుడూ, సాహసీ, కాని పెద్ద తాగుబోతు; నాయకత్వానికి పనికిరానివాడు.

మూడో వాడైన ఔరంగజేబే అన్నివిధాలా అందరి కంటె కూడా సమర్థుడు; కష్టపడి పని చేసేవాడు; రాజనీతి లోనూ యుద్ధతంత్రం లోనూ ప్రవీణుడు; అసాధారణమైన పరిపాలనాదక్షత కలవాడు.

షాజహాఁకు జబ్బు చేసినప్పుడు ఆగ్రాలో దారా ఒక్కడే ఉన్నాడు. ఈ వార్త వింటూనే అతని తమ్ములు, తమ తండ్రి నిజంగా పోయే ఉంటాడనీ, ఆ సంగతి దారా కప్పిపెట్టాడనీ అనుమానించారు. బెంగాలు రాజధాని అయిన రాజమహాలులో ఉన్న షుజా తానే చక్రవర్తినని ప్రకటించు

## 49. షాజహాఁ సంతానం

కుని, ఢిల్లీకి బయలుదేరాడు. వారాణసి దాకా వెళ్ళాక అతన్ని తిరిగి బెంగాలుకు తరిమారు.

మురాద్ కూడా అహమ్మదాబాదులో తానే చక్రవర్తి నని 1657 డిసెంబరు 5 వ ప్రకటించుకున్నాడు. మాల్వా లో అతను ఔరంగజేబును కలుసుకున్నాడు. ఇద్దరూ కలిసి దేవుడి పైనా, ప్రవక్త పైనా ప్రమాణం చేసి ఒక ఒప్పందం చేసుకున్నారు. దాని ప్రకారం, కొల్లగొట్టే ధనంలో ఒక వంతు మురాద్‌ది, రెండు వంతులు ఔరంగజేబుది; సామ్రాజ్యం గెలుచుకున్నాక పంజాబు, అఫ్ఘానిస్తాను, కాశ్మీరు, సింధు దేశాలు మురాద్‌కు చెందుతాయి, వాటికి అతను స్వతంత్ర రాజుగా ఉంటాడు.

వీ రిద్దరూ తమ తమ సేనలను వెంట బెట్టుకుని దండయాత్ర బయలుదేరారు. షాజహాం వారి పైకి జోధపూరు రాజైన జస్వంతసింహుణ్ణీ, కాసిమ్‌ఖాన్ అనే వాణ్ణీ సేనలతో పంపాడు. ఉభయ పక్షాలూ ధర్మాత్ (ఉజ్జయినికి 14 మైళ్ళు) వద్ద, 1658 ఏప్రిలు 15న తలపడ్డాయి. ఈ యుద్ధంలో ఔరంగజేబుకు చారిత్రక మైన విజయం లభించింది. జస్వంత సింహుడు పారిపోయి జోధపూరు చేరితే అతని భార్య కోటద్వారాలు మూయించింది.



ఔరంగజేబు, మురాద్‌లు విజయులై, చంబల్ నది దాటి, ఆగ్రాకు 8 మైళ్ళు తూర్పుగా ఉన్న సమూగర్ మైదానాన్ని చేరే సరికి, దారా 50 వేల సేనతో వారిని ప్రతిఘటించాడు. దారుణమైన యుద్ధం జరిగింది. అందులో దారా ఎక్కిన ఏనుగు దెబ్బతిన్నది. అతను దాని నుంచి దిగి గుర్రమెక్కాడు. దారా ఎక్కిన ఏనుగు అంబారీ ఖాళీగా ఉండటం చూసి, అతను చచ్చాడనుకుని, చావగా మిగిలిన అతని సైనికులు పారిపోయారు. విధిలేక దారా కూడా ఆగ్రాకు పారిపోయాడు. అతని సైనిక శిబిరం, ఫిరంగులతో సహా, ఔరంగజేబుకు

చిక్కింది. సమూగర్ యుద్ధంతో షాజహాఁ వారసుడు ఔరంగజేబని తేలిపోయింది. అతను ఆగ్రా పైకి ఎత్తివచ్చి, జూను 8న కోటను వశపరుచుకున్నాడు; కోటను రక్షించటానికి కోటలో వారు చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. షాజహాఁ తన కొడుకుకు బందీ అయిపోయాడు. తనను ప్రతిఘటించిన కోటలో వారికి శిక్షగా యమునా నదీ జలం కోటకు వెళ్ళకుండా ఔరంగజేబు నిరోధిస్తే, షాజహాఁ బావుల లోని ఉప్పునీరు తాగవలసి వచ్చింది. ఆయన తన కొడుక్కు, "హిందువులు యోగ్యులు, చచ్చిపోయిన తండ్రులకు జల తర్పణా లిస్తూనే ఉంటారు. నువు మహ గొప్ప ముసల్మానువై ఉండి బతికుండగానే నాకు నీరు లేకుండా చేశావు," అంటూ ఒక పద్యం రాసి పంపాడు.

షాజహాఁ సాదా సౌకర్యాలు కూడా లేని సామాన్య ఖైదీగా ఉంచబడ్డాడు. తన తండ్రి పాట్లను గురించి జహాఁఆరా ఎన్ని విజ్ఞాపనలు చేసినా ఔరంగజేబు పెడచెవిని బెట్టాడు. రాను రాను షాజహాఁ తన పరిస్థితికి అలవాటు పడిపోయి, వైరాగ్యం అవలంబించి, అస్తమానమూ మతం లోనే మునిగి ఉంటూ, జహాఁఆరా ఒక్కతే తోడుగా కాలం గడిపి, 1666 జనవరి 22న తన 74 వ ఏట మరణించాడు.

ఔరంగజేబు ఎత్తులు ఈపాటికి మురాద్ తెలుసుకున్నాడు. 1658 జూన్ 13న ఔరంగజేబు ఆగ్రా నుంచి ఢిల్లీకి వెళుతుండగా, రూపనగరు వద్ద అతను అన్నకు ఎదురు తిరిగాడు. ఔరంగజేబు అతన్ని యుక్తితో బందీగా పట్టుకుని, మూడేళ్ళ పాటు వేరు వేరు జైళ్ళలో ఉంచి, 1661 డిసెంబరు 4న మరణదండనకు గురి చేశాడు. ఈ లోపలనే, అంటే 1658 జులై 21న, ఔరంగజేబు ఢిల్లీలో చక్రవర్తిగా అభిషిక్తుడయాడు.



# నేహ్రూ కథ

## 16



మోతీలాలునూ, జవాహరునూ లక్నో జిల్లా జైలులో ఉంచారు. అక్కడ బారకాసుల లాటివి ఉండేవి. రాజకీయ ఖైదీలందరినీ వాటిలో ఉంచారు. మోతీలాలునూ, జవాహరునూ, మరి పదహారు మందినీ కలిపి విడిగా, ఒక విశాలప్రదేశం మధ్య ఉన్న నేతపాకలో ఉంచారు.

జవాహరు తన కాలాన్ని హెచ్చుగా చర్చల లోనూ, సంభాషణల లోనూ గడిపేవాడు, ఏ రోజు వార్తలా రోజు పత్రికలలో చదివేవాడు, ఉద్యమం ఎలా నడుస్తున్నదీ తెలుసుకునేవాడు. డిసెంబరు చివరి రోజులలో అహమ్మదాబాదులో కాంగ్రెసు సమావేశం జరిగింది. మూడు నెలల క్రితం కొల్లాయి కట్టటం ప్రారంభించిన గాంధీజీ ఆ కొల్లాయి తోనే సమావేశంలో పాల్గొన్నాడు. సమావేశానికి అధ్యక్షత వహించవలసిన దేశబంధు దాసు జైలులో ఉండటం వల్ల, హకీమ్ అజ్మల్‌ఖాన్ అధ్యక్షత వహించాడు. సమావేశంలో గాంధీజీ, చట్టా లన్నిటినీ ఎగబడి ఉల్లంఘించమనీ, దేశ ప్రజలందరూ వాలంటీరు దళాలలో చేరి జైళ్ళకు పోవలిసిందనీ పిలుపిస్తూ తీర్మానం ప్రతిపాదించాడు.

ప్రభుత్వం గుడ్డిగా అందరినీ అరెస్టు చేసే విధానాన్ని మార్చుకుని, ముఖ్యులను మాత్రమే అరెస్టు చెయ్యసాగింది. ప్రజలలో కూడా ఉత్సాహపు పొంగు కాస్త చల్లారింది, కాని ఉద్యమం నడుస్తూనే ఉన్నది. ముఖ్య నాయకు లనదగినవారు దాదాపు అందరూ జైళ్ళలో బంధించ బడ్డారు. కాని ఉద్యమానికి అసలు కారకుడైన గాంధీజీని ప్రభుత్వం అరెస్టు చేయ సాహసించలేదు. ఆయన రోజూ ప్రజలను ఉత్సాహపరుస్తూ సందేశాలిస్తూనే ఉన్నాడు. ఆయన ఏడాది



లోగా స్వరాజ్యం తెస్తానన్నమాట నిలబెట్టుకో లేకపోయినా, దేశప్రజల శంకలన్నీ క్షాళనం చేసి, వారి మనస్సులకు స్వేచ్ఛ ఇచ్చాడు.

జైలు జీవితం బోటు ప్రయాణం లాగా సాగిపోతున్నది. జవాహరు ఉదయం పూట తమ గుడిసె శుభ్రం చేసి, బట్టలు ఉతికి, కొంతసేపు నూలు వడికేవాడు. అతను తన బట్టలూ తన తండ్రి బట్టలూ ఉతికేవాడు. నిరక్షరు లైన ఖైదీలకు చదువుకున్న వాళ్ళు హిందీ, ఉర్దూ నేర్పేవారు. ఇలా కొంత కాలం గడిచాక ప్రభుత్వం ఒక బారకాసులో వాళ్ళు మరొక బారకాసుకు పోరాదని ఆంక్ష పెట్టి, విద్యాదానాన్ని నిలిపేసింది. శారీరకం గానూ, మానసికం గానూ విశ్రాంతి తీసుకొనటానికీ, రచన చెయ్యటానికీ జైలు జీవితం జవాహరుకు ఉపయోగపడింది.

రోజులు చాలా మందంగా గడుస్తున్నాయి. ఇంతలో పిడుగుపాటు లాటి సంఘటన ఒకటి జరిగింది.

గోరఖ్పూరు జిల్లా లోని చౌరీచౌరా అనే గ్రామం వద్ద గ్రామస్థుల ఊరేగింపులో గలాటా జరిగింది. పోలీసులు వచ్చి కాల్పులు జరిపారు. గ్రామస్థులకు ఆగ్రహావేశం వచ్చింది. ఇరవైఇద్దరు పోలీసులు వెళ్ళి పోలీసుస్టేషనులో దాక్కున్నారు. గ్రామస్థులా పోలీసుస్టేషనును చుట్టుముట్టి, దానికి నిప్పంటించారు. లోపల ఉన్న వారందరితో సహా పోలీసుస్టేషను దగ్ధమయింది.

ఈ దారుణ సంఘటనకు గాంధీజీ తల్లడిల్లిపోయాడు. ఆ సమయంలో ఆయన బార్డోలీలో పెద్ద ఎత్తున సహాయనిరాకరణోద్యమం సాగించనున్నాడు. అలాటి వాడు కాస్తా 1922 ఫిబ్రవరి నడిమధ్యలో సహాయ నిరాకరణోద్యమాన్ని నిలుపు చేసేశాడు; ప్రజలు నూలు తియ్యటమూ, తాగకుండా ఉండటమూ, హిందూ ముస్లిము సఖ్యతా, సంఘ సంస్కరణమూ మొదలైన



నిర్మాణ కార్యాలవలంబించటం మంచిదని సలహా ఇచ్చాడు.

గాంధీజీ తీసుకున్న ఈ ఆకస్మిక నిర్ణయం మోతీలాలునూ, జవాహరునూ చాలా కలతపరిచింది. ఎక్కడో ఒక కుగ్రామంలో హింస జరిగినందుకు దేశమంతా శిక్ష పొందాలా? అహింస పరమార్థమై కూర్చున్నట్టయితే అది సాధనంగా ఎంత మాత్రమూ పనికిరాదు. ఎందుకంటే ప్రభుత్వం ఎప్పుడు కావాలంటే అప్పుడు హింసను ప్రకోపించగలదు.

జైళ్ళలో ఉన్న మోతీలాలూ, లాలా లజ్పత్‌రాయీ ఉత్తరాలు రాశారు. ఫిబ్రవరి 24 న ఢిల్లీలో కాంగ్రెసు కమిటీ సమావేశం జరిగినప్పుడు గాంధీజీ ఆ ఉత్తరాలు చదివాడు. కాని ఆయన తన నిర్ణయం మార్చుకోక, ఆత్మద్రోహం కన్న పిరికివాళ్ళ మనిపించుకోవటం లక్ష రెట్లు నయమన్నాడు. డెలిగేట్లు ఆయన వాదనను ఆమోదించకపోయినా ఆయన నిర్ణయాన్ని ఏకగ్రీవంగా ఆమోదించారు. ప్రభుత్వం ఒక్క నిట్టూర్పు విడిచి గాంధీజీని అరెస్టు చేసింది!

ఈ సమయం లోనే జవాహరు శిక్ష అక్రమమని బయటపడి, అతన్ని విడుదల చేశారు. అతను ఇంటికి వెళ్ళి తన తల్లినీ,



భార్యనూ చూసుకుని, ఆనందభవనంలో కొద్ది రోజులుండి, గాంధీజీని కలుసుకుందామని సబర్మతీ ఆశ్రమానికి వెళ్ళాడు. అతను అక్కడికి చేరక ముందే ఫిబ్రవరి 10 రాత్రి, గాంధీజీని అరెస్టు చేసి సబర్మతీ జైలుకు తీసుకుపోయారు.

జవాహరు ఆయనను జైలులో చూడటమే గాక, విచారణ కూడా చూశాడు. న్యాయమూర్తి సర్ రాబర్ట్ బ్రూమ్‌ఫీల్డ్ అనే బ్రిటిషువాడు, గాంధీజీని ఎంతో మర్యాదగానూ, సహృదయతతోనూ చూశాడు. గాంధీజీ నేరం ఒప్పుకుంటూ, "ఇండియా ఇంగ్లండులు రెండూ అసహజమైన పరి





స్థితిలో ఉన్న సంగతి సహాయ నిరాకరణం ద్వారా వ్యక్తం చేసి నేను ఉభయదేశాలకూ సేవ చేశాననుకుంటున్నాను. మంచికి సహాయం చెయ్యుట మెలా అవసరమో, చెడ్డకు సహాయం నిరాకరించటం కూడా అంత అవసరమని నా నమ్మకం," అన్నాడు.

గాంధీజీకి ఆరేళ్ళు జైలుశిక్ష విధిస్తూ న్యాయమూర్తి ఇలా అన్నాడు; "మీ వంటి వ్యక్తిని నేనెన్నడూ విచారించ లేదు, విచారించే అవకాశం కూడా లేదు. మీ దేశ ప్రజల కోట్లాది మంది దృష్టిలో మీరు గొప్ప దేశభక్తులన్నదీ, నాయకులన్నదీ విస్మరించటం సాధ్యం కాదు. రాజకీయాలలో మీతో ఏకీభవించని వారు సైతం మిమ్మల్ని ఒక ఉన్నతా దర్శపరుడుగానూ, ఉత్తముడుగానూ, ఒక ఋషిలాగా కూడా చూస్తారు... కాలక్రమాన ప్రభుత్వం మీ శిక్షను తగ్గించటానికి అనువైన పరిస్థితు లేర్పడే పక్షంలో అందరికన్న నేను హెచ్చుగా సంతోషిస్తాను."

జైలు నుంచి బయటికి వచ్చిన సుఖం జవాహరుకు దక్కలేదు. అతని వారందరూ జైళ్ళలోనే ఉన్నారు. కాంగ్రెసు నాయకులంతా జైళ్ళలో ఉన్నారు. కాంగ్రెసు యంత్రం నాయకత్వం లేక శిథిలావస్థలో ఉన్నది. అది చూశాక జవాహరుకు ఒక విషయం తట్టింది: గాంధీజీ ఉద్యమాన్ని నిలుపు చెయ్యటానికి చౌరీచౌరా ఉదంతం ఒక్కటే కారణం కాకపోవచ్చు. దేశంలోని పరిస్థితిని పసి కట్టడంలో గాంధీజీ సమర్థుడు. దేశపరిస్థితి మాట అలా ఉంచి, కాంగ్రెసు సంస్థ ఎంత అసహాయస్థితిలో ఉన్నదంటే, క్రమశిక్షణ చాలా దిగజారింది, ఎవరైనా ఇప్పుడు కాంగ్రెసులోకి జొరబడి, ఆ సంస్థను తమ స్వప్రయోజనాలకు వినియోగించ వచ్చు. ఈ వాతావరణం చూసినట్టయితే గాంధీజీ సకాలం లోనూ, సాహసం తోనూ సహాయ నిరాకరణోద్యమాన్ని నిలిపేశాడు!





# నవాబు నందిని

## 3

మత్రాసింగు పంపగా దారుకేశ్వరానికి బయలుదేరిన సైనికుడికి మందారణదుర్గ మార్గంలో గజపతిదిగ్గజుడు కనిపించి, "అల్లా మహాదేవుడు హుజూర్ వారి ఆరోగ్యాన్ని కాపాడు గాక!" అన్నాడు.

దిగ్గజుడి భాషా, వాలకమూ చూసి ఆశ్చర్యపడి సైనికుడు తన గుర్రాన్ని మెల్లిగా నడిపిస్తూ దిగ్గజుణ్ణి సంభాషణలో పెట్టాడు. సైనికుడి ప్రశ్నలకు సమాధానంగా దిగ్గజుడు, మొదట తాను హిందువుణ్ణేననీ, తరవాత తాను ముసల్మానుగా మారిపోయినట్టు తెలిసిందనీ, తిరిగి హిందువుడు కావటానికి చెయ్యవలిసిందంతా చేశాననీ, అయినా తన జాతి గురించిన అనుమానం గురువుగారు చెబితేగాని పోదనీ, కోటలో ఉండే ఆస్మానీ తనకు చాలా ఆప్తురాలనీ చెప్పాడు.

ఇలా మాట్లాడు కుంటూ వారు మందారణదుర్గాన్ని సమీపించారు. సైనికుడు దిగ్గజుడితో, "యువరాజు జగతసింహుడు బందీ అయినట్టు కోటలో చెబుతావా?" అని అడిగాడు.

"ఎందుకు బందీ? ఎవరికి బందీ?" అని దిగ్గజుడు ప్రశ్నించాడు.

"ఎందుకు బందీ అంటే చెప్పలేను. కాని అతన్ని బందీగా పట్టుకున్నది మేమే. అలా చెయ్యమని మానసింహమహారాజు మాకాజ్ఞ ఇచ్చారు," అన్నాడు సైనికుడు.

దామోదర ముఖర్జీ



దిగ్గజుడికి గుండెలో రాయి పడింది. వెనక ఇలాగే వీరేంద్రసింహుడు బందీ అయినప్పుడు, కోటలో ఉన్నవారంతా బందీ లయిపోయారు. చాలా గొడవ జరిగింది. ఇప్పుడు శత్రుసైనికులు జగతసింహుణ్ణి పట్టారు. తాను చూసినవాడు మొదటి సైనికుడన్న మాట. మిగిలినవాళ్ళు వెనకగా వచ్చిపడి కోటలో ఉన్న వాళ్ళందరినీ పట్టేస్తారు. సందేహం లేదు. ముందు ఈ సైనికుణ్ణి వదిలించుకుని, కోటకు వెళ్ళి ఈ దారుణవార్త అందరికీ చెప్పాలి.

ఇలా అనుకుని దిగ్గజుడు సైనికుడితో, "ఈ మాట నేను కోటలో చెబుతాను. మీరు వెళ్ళి మరో పని చూసుకోండి," అన్నాడు. సైనికుడు వెళ్ళిపోయాడు.

దిగ్గజుడు కాలి సత్తువ కొద్దీ పరిగెత్తుకుంటూ కోటలో ప్రవేశించి, అస్మానీకి ఈ వార్త చెప్పాలనే ఉద్దేశంతో అంతఃపురం ప్రవేశించబోయాడు. కాని ద్వారపాలకుడతన్ని లోపలికి వెళ్ళనివ్వలేదు.

తాను అక్కడివాణ్ణేననీ, అభిరామస్వామి శిష్యుణ్ణనీ, అస్మానీని తాను బాగా ఎరుగుదుననీ దిగ్గజు డన్నాడు.

"అయితే ఇక్కడే ఉండు. ఎవరైనా కనిపిస్తే లోపలికి కబురు చేస్తాను," అన్నాడు ద్వారపాలకుడు.

విమల అతఃపురం పై అంతస్తు లోని కిటికీ తెర వెనక నుంచి ద్వారపాలకుడికీ, దిగ్గజుడికీ జరిగే వాగ్వాద మంతా గమనిస్తున్నది. ఆమె అందమూ, చురుకూ, అలంకారాలూ అన్నీ పోయాయి. శరీరం క్షీణించింది. వార్థక్య లక్షణాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

విమల ఉన్న చోటికి అస్మానీ కూడా వచ్చింది.

"గజపతి దిగ్గజుడు ద్వారపాలకుడితో ఘర్షణ పడుతున్నాడు. వెళ్ళి అతన్ని తీసుకురా," అన్నది విమల అస్మానీతో.

అస్మానీ కిందికి దిగి వెళ్ళి ఒక చీకటింట ప్రవేశించి, దిగ్గజుణ్ణి పిలుచుకు రమ్మని లక్ష్మణి అనే ఒక దాసీని ద్వారం వద్దకు పంపింది.

లక్ష్మణి వెళ్ళి, "ఏం రసిక రాజా, జ్ఞాపకం ఉన్నానా?" అని అడిగింది.

ఆమె నెన్నడూ చూసి ఉండని దిగ్గజుడు చాలా కంగారుపడి, "నిన్ను చాలా సార్లు చూశాను, బాగా ఎరుగుదును. కాని ఎవరివో గుర్తురావడం లేదు," అన్నాడు.

లక్ష్మణి అమాయకుడైన దిగ్గజుణ్ణి కాస్సేపు ఏడిపించి, అస్మానీ ఉన్న చోటికి తీసుకుపోయింది.

"ఏం రసిక రాజా, ఇంతకాలం ఏమయావు? ఎక్కడ ఉన్నావు?" అని అస్మానీ అడిగింది.

"అదంతా తరవాత చెబుతాను గాని, ముందు వెంటనే నాతో బయలుదేరు. ఇక్కడ ఉండటం—చాలా ప్రమాదం," అన్నాడు దిగ్గజుడు.

"ఏమిటా ప్రమాదం?"

"యువరాజును పట్టుకు పోయారు!"

"ఎవరు?"

"మానసింహుడి మనుషులు."

"ఎక్కడ?"




"దారిలో పోతూంటే. ఇక దుర్గంలో వారంతా బందీ లవుతారు. నేను నీ గురించే బెంగ పడుతున్నాను. వెంటనే వచ్చెయ్యి. ఎలాగైనా పారిపోదాం!"

ఈ వార్త విమలకు వెంటనే చెప్పాలి. అందుకని అస్మానీ దిగ్గజుడితో, "నువ్వన్నది నిజమే. పారిపోదాం. నువు ముందు పద. చీకటి పడగానే సామాన్లు తీసుకుని పోదాం," అన్నది.

"అంతదాకానా? ఆలస్యం వల్ల అపాయం."

"నువు ఆశ్రమానికి వెళ్ళి అక్కడి వాళ్ళతో మానసింహుడి మనుషులు రెండు

గంటల్లో వచ్చి పడబోతున్నారని చెప్పు. సమయానికి నేను వచ్చి నిన్ను అక్కడ కలుసుకుంటాను."

అస్మానీ ఈ మాట అనగానే దిగ్గజుడికి కంపరం పుట్టి, వణుకుతూ, "అలా అయితే నే నిప్పుడే ఆశ్రమానికి పోతున్నాను," అంటూ పరుగు తీశాడు.

త్వరలోనే దిగ్గజుడు తెచ్చిన దుర్వార్త దుర్గ మంతటా తెలిసిపోయింది. దిగ్గజుడు చెప్పిన వివరాల వల్ల ఏమీ బోధపడక, నిజం తెలుసుకు రమ్మని అభిరామస్వామి ఒక మనిషిని గుర్రం మీద పాట్నాకు పంపాడు.

చీకటి పడ్డాక విమలా, అస్మానీ కలిసి అభిరామస్వామి కుటీరానికి వచ్చారు. అభిరామస్వామి జింకచర్మం మీద కూర్చున్నాడు. ఆడవాళ్ళాయన కెదురుగా నేల పైన కూర్చున్నారు.

"ఇప్పు డేం చెయ్యాలి?" అని విమల అడిగింది.

"ఒకనాడు ఇదే చోట ఇలాటి మాటే అడిగావు, జ్ఞాపకం ఉన్నదా? ఆ వివాహానికి మానసింహుడు ఒప్పడని నే నంటే, యువరాజు స్వతంత్రుడని నీ వన్నావు. ఆ స్వాతంత్ర్యం ఎక్కడికి దారి తీసిందో చూశావా? యువరాజుకు ఎన్నడూ ఎలాటి



స్వాతంత్ర్యమూ లేదు. అతను తండ్రికి ఇష్టం లేని పని ఏదీ చెయ్యలేడు. అతను మానసింహుడి కొడుకు మాత్రమే కాదు, ఆయన కింది నౌకరు కూడా," అన్నాడు అభిరామస్వామి.

"ఈ సంగతి ఇప్పుడు గద తెలిసింది! ఒక వేళ ఆనాడే తెలిసినా కూడా ఆ ప్రేమ ప్రవాహాన్ని ఆపటం ఎవరికి సాధ్యమవుతుంది? తిలోత్తమను గురించి మీకు తెలీదు, నాకు తెలుసు."

"నేను తెలుసుకోవలసిం దేమీ లేదు. ఒక్కసారి చూసుకున్నంత మాత్రాన ప్రగాఢ ప్రేమ పుట్టుకొస్తుం దంటే నేను నమ్మను. అది మోహం మాత్రమే. మోహం కూడా బలవత్తరమైనదే, కాని దాన్ని మొగ్గలోనే తుంచి పారేస్తే అందు వల్ల ప్రమాదం ఉండదు. నీ కథంతా తెలుసు నను కున్నాను."

"నేను తిలోత్తమకు సుఖమూ, ఆనందమూ చేకూర్చాలని అలా చేశాను. నేను తిలోత్తమ కోసమే బతికాను. నాకు తిలోత్తమ రెండో ప్రాణం. ఆ పిల్ల కష్టాలన్నీ గట్టెక్కి సమస్త సుఖాలూ ఒనగూడా యను కుంటే ఆమె మళ్ళీ శోకసముద్రంలో పడి పోయింది. నా దుఃఖాన్ని ఎవరితో చెప్పు కోను? నేను చేసిన ఏ పొరపాటు చేత






ఆమె కీ దుఃఖం వచ్చిపడిందో చెబితే పశ్చా త్తాప పడతాను,'' అన్నది విమల.

అమె చేసిన ప్రతి పనీ తప్పేనని అభి రామస్వామి చెప్పాడు. మానసింహుడి కొడుక్కు వీరేంద్రసింహుడి కూతురితో మనువు పొసగదని విమలకు రూఢిగా తెలుసు. అందుచేత ఆమె తిలోత్తమ హృద యంలో రేకెత్తిన ఆశను వెంటనే తుంచి పారెయ్యవలసింది. ఆమె అలా చేయలేదు. శైలేశ్వర మందిరం నుంచి మొదటిసారి వెళ్ళిపోయే టప్పుడు జగతసింహుడికి తిలోత్తమ ఎవరో తెలియదు. అత నలాగే వెళ్ళిపోతే ఇంత జరిగేది కాదు. విమల అతన్ని పదిహేను రోజుల అనంతరం అక్క డికి రమ్మనీ, అప్పుడు తిలోత్తమ గురించి చెబుతాననీ మాట ఇచ్చింది. అది పొర పాటు. ఆ తరవాత ఆమె అభిరామస్వామి హెచ్చరికను కూడా తృణీకరించి జగత సింహుణ్ణి రెండవసారి కలుసుకుని, తిలో త్తమ సంగతి చెప్పేసింది. అతనికి తిలో త్తమను చూపిస్తానని మాట ఇవ్వటం మరో తప్పు. ఆమె వీరేంద్రసింహుడి భార్య అవు గాక, మొగలాయి సేనాపతిని రహస్యంగా దుర్గం లోకి ప్రవేశ పెట్టే అధికారం ఆమెకు లేదు. అందువల్ల దుర్గం పఠానుల వశమై, అనేక దుష్ఫలితాలు కలిగాయంటే అందుకు బాధ్యత అంతా విమలదే.

"ఆలోచించుకో. నీవు చేసిన ఒక్క పనీ మంచిది కాదు,'' అన్నాడు అభిరామ స్వామి చివరకు.

విమల తన తండ్రి అయిన అభిరామ స్వామి కాళ్ళ పైన పడి, "అర్థమయింది. అన్నీ పాడు పనులే చేశాను. ఇప్పుడు ఉపాయం ఏదైనా ఆలోచించి మమ్మల్ని కాపాడండి,'' అన్నది.

"నేనూ అదే ఆలోచిస్తున్నాను. నేను పంపిన మనిషి తిరిగి వచ్చిన దాకా ఏమీ చెయ్యటానికి లేదు. మానసింహుడికి కొడుకు





పైన ఏ విషయమై ఆగ్రహం కలిగిందీ తెలిసిన మీదటనే మనం ఏ ఉపాయమైనా చేసేది," అన్నాడు అభిరామస్వామి.

"ఆ మనిషి ఎంత కాలానికి తిరిగి వస్తాడు?"

"రేపే రావచ్చు. పాట్నా దాకా వెళ్ళవలసి వస్తే అతను రావటానికి వారం, పది రోజులు పట్టనూ వచ్చు."

"ఎనిమిది పది రోజులే! అంత దాకా తిలోత్తమ ఎలా బతికి ఉంటుంది?"

"నీవు ఆమెకు ధైర్యం చెప్పు. రేపు ఉదయం నేను కూడా వచ్చి మాట్లాడతాను," అన్నాడు అభిరామస్వామి.

"మానసింహుడు కన్న కొడుకని దయ దలచకపోతాడా?" అన్నది విమల.

"ఆత్మాభిమానం జాస్తిగా గల వాడికి కొడుకని ఏమిటి? అయినవాళ్ళని ఏమిటి?"

"చివరకేమవుతుందంటారు?"

"ఆడదానివి. నీకీ విషయాలు తెలియకుండా ఉండటం మంచిది."

"మీరంటే మానసింహుడికి గౌరవమనుకుంటాను. మీరు వెళ్ళి చెబితే లాభం ఉంటుందేమో?"

"అలాటిదేమీ ఉంటుందనుకోను. నేను జోక్యం కలిగించుకుంటే పరిస్థితి మరింత విషమించ వచ్చు. మానసింహుడు గౌరవించే మనిషి ఎవరైనా చెప్పాలి...చాలా పొద్దుపోయింది. ఇప్పుడు మీరు వెళ్ళిపోయి రేపు ఉదయం రండి," అని అభిరామస్వామి విమలనూ, అస్మానీనీ పంపేశాడు.

పాట్నాకు వెళ్ళిన మనిషి సమాచారమంతా పోగుచేసుకుని తిరిగి వచ్చాడు. యువరాజుకు యావజ్జీవ కారాగార శిక్ష విధించారని తెలియగానే దుర్గంలో అందరూ హతాశులైపోయారు.

అభిరామస్వామి ఏదో నిశ్చయానికి వచ్చి, తాను తీర్థయాత్రల మీద వెళుతున్నట్టు ప్రకటించి బయలుదేరి వెళ్ళాడు.



కాని, ఆయన ఏదో ప్రయత్నం మీద వెళు తున్నాడని విమల గ్రహించింది.

తిలోత్తమ పూర్తిగా కుంగిపోయింది. ఆమెకు నిద్రాహారాలు లేవు, స్నానమూ, అలంకరణలూ లేవు. దుఃఖసాగరంలో పడి కొట్టుకుంటూ కటిక నేలపై పడి దొర్లు తున్నది. యువరాజు పది రోజులుగా కారాగృహ వాసం చేస్తున్నాడు; అతని భార్య అయిన తిలోత్తమ అతని కన్న కూడా దీనావస్థలో ఉన్నది. తియ్యని కల లాటి సుఖం ఇట్టె కరిగిపోయింది. ఈ సారి ఆమెకు కలిగిన దుఃఖానికి అవతలి ఒడ్డు లేదు. తన భర్త జీవితాంతం దాకా తనకు మరి కనిపించడు.

ఇలాటి పరిస్థితి ఒక్కొక్కప్పుడు మనుషుల చిత్తవృత్తిని పూర్తిగా మార్చేస్తుంది. ఎల్లప్పుడూ పరిస్థితులకు తల ఒగ్గి, అసహాయురాలుగా ఉండిన తిలోత్తమలో ప్రతీకార బుద్ధి తలఎత్తింది. తాను ఎంత ఏడ్చినా తన భర్తకు కించిత్తు కూడా ప్రయోజనం ఉండదు. ఏదైనా చెయ్య దలిస్తే అతని కష్టాలు తొలగించే ప్రయత్నమే చెయ్యాలి.

తిలోత్తమ చప్పున లేచి కూర్చుని, "ఎవరక్కడ?" అని పిలిచింది. ఆమె పిలుపు విని ఒక దాసి వచ్చింది. దాసి చేత కలమూ, కాగితమూ తెప్పించి, తిలోత్తమ ఆయషాకు ఒక ఉత్తరం రాసింది. అందులో ఆమె, మానసింహుడి చేత తన భర్త అయిన జగతసింహుడు యావజ్జీవ కారాగార శిక్ష విధించబడటం గురించి రాసి, "ఈ ప్రపంచంలో యువరాజు క్షేమం కోరే వారిలో నీవు అగ్రగణ్యురాలి వని భావించి నీకీ ఉత్తరం రాస్తున్నాను. అందు గురించి నీ వేమి చేయగలవో, ఏమి చేస్తావో నాకు తెలియదు," అని రాసింది.

తరవాత తిలోత్తమ ఆ ఉత్తరానికి దారం కట్టి, సీలువేసి, దాన్ని తీసుకుని గది నుంచి వెళ్ళిపోయింది. —(ఇంకావుంది.)





# సర్వనాశనం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ వీ పడే శ్రమ అంతా ఒక స్త్రీ కోసం కాదు గద? ఎందుకంటే, స్త్రీల మూలాన ఎంతటి మహనీయులకైనా దుర్భరమైన కష్టాలు వస్తాయి. అందుకు నిదర్శనంగా, కాంచనప్రభ అనే స్త్రీ మూలాన కుండలదేశం ఎలా సర్వనాశనమైనదీ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

కుండలదేశాన్ని రత్నకుండలుడనే రాజు పాలించేవాడు. అతను మామూలు రాజు కాదు, రారాజు. పన్నెండు రాజ్యాల పాలకులు అతనికి లోబడి ఉండేవాళ్ళు. రత్నకుండలుడి కున్న బలం అతని వద్ద ఉండే పన్నెండు మంది దండనాయకులు. వారం

## బేతాళ కథలు



దరూ ఆరితేరిన యోధులు. రాజు వారిని మంత్రుల కన్న హెచ్చుగా చూసుకునేవాడు. వారు కూడా నిష్కల్మషమైన రాజభక్తి గలవారు; తమ రాజు కోసం ప్రాణాలర్పించటానికి ఎల్లప్పుడూ సిద్ధంగా ఉండేవాళ్ళు.

ఒకనాడు రాజు సభచేస్తూవుండగా ఆస్థాన కవికి ఆడపిల్ల పుట్టినట్టు వార్త వచ్చింది. వెంటనే సభికులు ఆస్థానజ్యోతిష్కుణ్ణి ఆమెకు జాతకచక్రం వేసి ఫలితం చెప్పమన్నారు. జ్యోతిష్కుడు మీనమేషాలు గుణించి, "ఈ పిల్ల నిశ్చయంగా జగదేక సుందరి అవుతుంది. కాని ఈమె వల్ల రాజ్యానికి చాలా గొప్ప చేటున్నది. ఈమె



అడుగు పెట్టిన చోట మహోపద్రవాలు తప్పక జరుగుతాయి," అన్నాడు.

ఈ మాటలు వింటూనే దండనాథులు కొందరు, "దేశసౌభాగ్యం కోసం మహావీరులు సైతం ప్రాణాలర్పిస్తూండగా ఇంకా కళ్ళు తెరవని పసిగుడ్డు ఒక లెక్కా? ఆమెను వెంటనే చంపించండి," అన్నారు.

రత్నకుండలుడు వారిని వారిస్తూ, "పసికందును చంపవద్దు. ఆమెను నిర్జన స్థలంలో ఉంచి పెంచి, యుక్తవయస్కురాలయాక నేను నా భార్యగా చేసుకుంటాను. ఆమె లోకం ముఖం చూడకుండానూ, లోకం ఆమె ముఖం చూడకుండానూ నేను కట్టుదిట్టం చేస్తాను," అన్నాడు.

ఆ ప్రకారమే రాజు నిర్జనమైన కొండలోయలో ఒక ఇల్లు కట్టించి, ముగ్గురు స్త్రీల రక్షణలో ఆ చంటిపిల్ల పెరిగేటందుకు ఏర్పాటు చేశాడు. ఆ ఇంటికి చుట్టూ ఉండే కొండల మీద భటులను అహర్నిశలు కాపలా పెట్టాడు. రాజుగారు తప్ప మరెవరూ ఆ ఇంటికి అరకోసు దూరం లోకి రాకుండా చూడటమే వాళ్ళ పని.

ఆ పిల్ల శరీరచ్ఛాయ చూసి ఆమెకు కాంచనప్రభ అని రాజే నామకరణం చేశాడు. కాంచనప్రభ అక్కడే పెరిగి పెద్దదై,



కాలక్రమాన యుక్తవయస్కురా లయింది. ఆమెకు కలిగిన ప్రపంచ జ్ఞాన మంతా ఆమెను పెంచిన ముగ్గురు స్త్రీల ద్వారానే కలిగింది. అందులో ఒకామె ఆమెకు విద్య నేర్పింది, ఎన్నో కథలు చెప్పింది. ఆమె ద్వారానే కాంచనప్రభ పాతకాలపు ప్రేమ పురాణా లన్నీ విని, తాను ప్రసిద్ధ సౌందర్యవతులతో పోల్చ దగిన మనిషి అయినట్టు తెలుసుకున్నది.

"నేను ఎప్పుడూ ఈ ముసలి రాజునే చూస్తూ ఉంటాను. ఇప్పుడు ఎక్కడా అందమైన పురుషులు లేరా?" అని కాంచనప్రభ తన గురువు నడిగింది. రాజు కాంచనప్రభను త్వరలోనే పెళ్ళాడ నున్నాడని ఆ స్త్రీకి తెలుసును. అందుచేత ఆమెకు కాంచనప్రభ పైన జాలి కలిగింది.

"అందమైన పురుషులు లేకపోవట మేమిటి? రాజుగారు వచ్చే మార్గాన కనుమ వద్ద ఒక వీరయువకుడు కాపలా ఉంటాడు. అతను నవమన్మథుడే! అలాటి వాడు భర్త కావాలని ఏ కన్య అయినా వెయ్యి దేవుళ్లకు మొక్కుకుంటుంది," అన్నదామె.

కాంచనప్రభకు ఒక్కసారి ఒళ్ళు ఝల్లుమన్నది. ఎలాగైనా ఆ వీరయువకుణ్ణి ఒక్కసారి చూడాలని ఆమెలో బలమైన



కోరిక కలిగింది. ఒకనాటి సాయంకాలం, రాజు వచ్చే వేళ దాటిపోయాక, ఒక ముతక శాలువ ఒంటినిండా కప్పుకుని కనుమ ద్వారం కేసి బయలుదేరింది.

కనుమ ద్వారం వద్ద కాపలా ఉండే యువకుడు సాధారణ సైనికుడు కాడు. అతని పేరు కేదారుడు. అతని అన్న లిద్దరూ రాజుగారి వద్ద దండనాథులే. యోధుడుగా అత నింకా వారి స్థాయి అందుకోలేదు గాని, అవకాశం దొరికితే తన శౌర్య పరాక్రమాలు ప్రదర్శించటానికి సిద్ధంగానే ఉన్నాడు. అతని వయస్సు కూడా చాలా తక్కువ; ఇరవై యేళ్ళు.

కేదారుడు మసకవెలుగులో ఎవరో రహస్య మందిరం నుంచి తన కేసి వస్తూ ఉండటం చూసి, అక్కడ ఉండే ముగ్గురు స్త్రీలలో ఒకతె అయి ఉంటుం దనుకుని, ఆమె కేం కావాలో తెలుసుకుందా మనే ఉద్దేశంతో కనుమ నుంచి బయలుదేరి కాంచనప్రభకు ఎదురు వచ్చాడు.

ఇద్దరూ ఒకరి కొకరు సమీపంగా వచ్చాక కాంచనప్రభ తాను కప్పుకున్న శాలువ తీసేసి, తన అసాధారణ సౌందర్యం ప్రదర్శిస్తూ నిలబడింది.

చాలాసేపు ఇద్దరూ కొయ్యబొమ్మ లల్లే నిలబడిపోయారు. చివరకు కేదారుడు, "నాతో వచ్చేస్తావా? మనం పెళ్ళిచేసుకుని ఏ దేశమన్నా పోదాం," అన్నాడు.

కాంచనప్రభకు రాజంటే ప్రస్తుతం భయం ఉన్నది. కాని ఈ యువకుడు తన భర్త అయే పక్షంలో తాను దేవుడికి కూడా భయపడ వలిసిన అవసరం ఉండదని ఆమెకు ధైర్యం కలిగింది. "ఎక్కడికి రమ్మన్నా వస్తాను, నన్ను నీ వెంట తీసుకుపో," అన్నదామె.

క్రమంగా చీకటి పడుతున్నది. కేదారుడు కాంచనప్రభను వెంటపెట్టుకుని బాగా పొద్దు పోయి తన అన్నల వద్దకు వెళ్ళి తాను తలపెట్టిన సాహసం గురించి వాళ్ళకు



చెప్పాడు. వాళ్ళు అతన్ని తప్పు పట్టలేదు. "మీ రిద్దరూ వెళ్ళాడా లనుకుంటే ఈ రాజ్యంలో మీ ప్రాణాలు దక్కవు. ఇంకొక రాజ్యంలో నైనా మీకు క్షేమం ఉంటుందని తోచదు. మిమ్మల్ని కాపాడ టానికి మేం కూడా వస్తాం. తెల్లవారే లోపుగా మనం రాజ్యపు ఎల్లలు దాటిపోతే మనకు అంతగా ప్రమాదం ఉండదు," అన్నారు కేదారుడి అన్నలు.

వారి కష్టాలకు అదే ప్రారంభం. వాళ్ళు దేశదేశాలు తిరిగారు. ఏ రాజు వద్ద కొలువులో చేరినా, ఆ వార్త త్వరలోనే రత్న కుండలుడికి తెలియటమూ, అతను ఆ రాజుకు హెచ్చరిక పంపటమూ, వాళ్ళకు ఆ రాజ్యంలో మంచినీరు పుట్టకపోవటమూ జరిగింది. చివరకు వారికి చుట్టుపట్ల ఉండే ఏ దేశం లోనూ నిలువ నీడ దొరక కుండా పోయింది. అందుచేత వారు అరణ్యావాసం చేశారు. ఆకలములూ, వేటాడిన మృగాలూ వారికి ఆహార మయాయి. గుహల లోనూ, చెట్ల మీదా కూడా నివాసాలు చేశారు. ఆ జీవితం దుర్భర మనిపించి, వారు అరణ్యం దాటి దేశాలు కాని దేశాలలో చొర బడి, అక్కడ ఏదో విధంగా జీవయాత్ర గడపాలని చూశారు. అక్కడ వారికి మరొక చిక్కు వచ్చిపడింది. ఆ దేశాలలో బలవం






తులు కాంచనప్రభను కాజెయ్యాలని చూశారు. కొందరు దౌర్జన్యానికి దిగితే అలాటి వాళ్ళను కేదారుడూ, అతని అన్నలూ ఎదిరించి, చంపటం కూడా జరిగింది. వాళ్ళు హంతకులుగా శిక్ష పొందకుండా తప్పించుకోవటానికి ఇంకా దూర దేశాలకు పోవలసి వచ్చింది.

ఇంతలో రత్నకుండలుడు అకస్మికంగా ఒక ప్రకటన చేశాడు: కేదారుడూ, అతని అన్నలూ చేసిన ద్రోహాన్ని ఆయన క్షమించి, వారిని తన దేశంలో ఉండనిస్తా నన్నాడు. ఈ మాట మిగిలిన దండనాధులకు ఎంతో అనందం కలిగించింది. కేదారుడి అన్నలు



తమ నుంచి చీలిపోవటం వాళ్ళ కెంతో బాధగా ఉన్నా, ఇంత కాలమూ వా రేమీ అనలేని స్థితిలో ఉండిపోయారు. రాజుగారి ఔదార్యం వారిని పరవశులను చేసింది.

రాజాజ్ఞ పొంది ముగ్గురు దండనాధులు కేదారుణ్ణీ, అతని అన్నలనూ వెతుక్కుంటూ చివరకు ఎలాగయితేనేం వారి అచూకీ తెలుసుకుని, "మిమ్మల్ని రాజుగారు క్షమించాడు. వచ్చెయ్యండి," అని చెప్పారు.

"వాళ్ళ మాటలు నమ్మవద్దు. ఇందులో ఏదో మోసం ఉన్నది," అని కాంచనప్రభ వారిని హెచ్చరించింది.

"మేము వంచకులం కాము. రాజుగారి గూఢచారులమూ కాము. మా మాట నమ్మవచ్చు. మీ ప్రాణాలకు పిసరంత హాని జరిగితే దానికి మా ముగ్గురి ప్రాణాలూ బలి ఇస్తాం," అన్నారు వచ్చిన దండనాధులు

"వాళ్ళు పొరపడుతున్నారు. రాజు దుర్బుద్ధి వాళ్ళకు తెలియదు," అన్నది కాంచనప్రభ.

అమె వైఖరి చూసి కేదారుడి అన్నలకు కోపం వచ్చింది. వాళ్ళు మాటను నమ్మి, మాట కోసం ప్రాణాలిచ్చే వాళ్ళు. "మా కెందుకు పిరికి మందు పోస్తావు? మేము చావంటే భయపడే వాళ్ళ మను





కుంటున్నావల్లే ఉంది. నిందితులుగా చావటం మా కిష్టం లేదు గాని, మా సోదర యోధుల అండ ఉండగా వీర మరణం పొందటానికి మే మెప్పుడూ వెనుతీయం," అన్నారు వాళ్ళు కాంచనప్రభతో.

అందరూ స్వదేశానికి తిరిగి వచ్చారు. కాంచనప్రభ అన్నదే నిజయయింది. కేదారుడూ, అతని అన్నలూ ఒంటరిగా ఉండే టందుకు రాజు యుక్తి పన్నాడు. వాళ్ళు తిరిగి వచ్చే సమయానికి ఆయన తన దండ నాథులకు విందు ఏర్పాటు చేశాడు. ఆ విందులో పాల్గొనటానికి అందరూ వెళ్ళి ఉన్న సమయంలో తుచ్ఛులైన ఆయుధ భటులు వచ్చి, కేదారుడూ అతని అన్నలూ, కాంచనప్రభా ఉన్న ఇంటి పైన పడ్డారు. వారిలో చాలా మందిని ఆ అన్నదమ్ములు చంపేసి, మిగిలిన వారిని పారదోలారు.

ఇది జరిగిన కొద్ది సేపటికి రాజుగారి వద్ద నుంచి ఒక అధికారి వచ్చి, "మీ పైన దుండగు లెవరో చెయ్యిచేసుకో బోయారట. రాజుగారు చాలా నొచ్చుకున్నారు; మీకు క్షమాపణ చెప్పుకుంటారట, మిమ్మల్ని బయలుదేరి రమ్మన్నారు," అని చెప్పాడు.

ఆ అధికారి మాటలు నమ్మి అన్నదమ్ములు ముగ్గురూ ఇంటి బయటికి



వచ్చారు. వెంటనే రాజభటులు వారిని పట్టుకుని బంధించి, ఒంటరిగా ఉన్న రాజు వద్దకు తీసుకుపోయారు.

"వీళ్ళ ముగ్గురినీ శిరశ్ఛేదం చెయ్యండి," అన్నాడు రాజు.

ఎవరికీ తెలియకుండా మరణదండన జరిగిపోయింది. ఈ వార్త తెలియగానే దండ నాయకులలో సగం మంది వధ్యభూమికి వెళ్ళి శవాలను చూశారు. వారితో బాటు వెళ్ళిన కాంచనప్రభ కేదారుడి శవాన్ని చూస్తూనే గుండె పగిలి చనిపోయింది.

రాజు చేసిన పని చాలా నీచమైనదని కొందరు దండనాయకులు తిరుగుబాటు

చేశారు. రాజు ఏమి చేసినా అందులో దోషం ఉండదనీ, వంచనకు విరుగుడు వంచనే అనీ మరి కొందరు దండనాయకులు వాదించారు. వారు రెండు కక్షలుగా చీలారు. వారితోబాటు సేనలూ చీలాయి. వారి మధ్య భయంకరమైన అంతర్యుద్ధం జరిగి సర్వనాశనం అయింది. ఆ అంతర్యుద్ధంలో రాజు కూడా ఆహుతి అయాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, ఈ సర్వనాశనానికి కారకు లెవరు? ఈ మహాపాపంలో ఎవరెవరికి ఎంతెంత వంతున్నది? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "తప్పు పూర్తిగా రాజుది. కాంచనప్రభ పుట్టినప్పుడే జ్యోతిషుడిలా జరుగుతుందని చెప్పాడు. రాజు అందులో విశ్వాసం ఉంచాడు. కాని దేశానికి అరిష్టం జరుగుతుందన్న విషయం దండనాయకులను బాధించింది గాని, రాజును బాధించలేదు. కనకసేన వారా పిల్లను అప్పుడే చంపమంటే అడ్డుపడ్డాడు. పై పెచ్చు ఆ జ్యోతిష్కుడి మాటల మీది నమ్మకంతోనే ఒక అపూర్వ సుందరిని తనకు భార్యగా చేసుకో గోరాడు. ఆమె తనకు దక్కకుండా పోయాక, ఆమెకూ, ఆమెను కాపాడే వాళ్ళకూ పరిసర దేశాల్లో నిలవ నీడ లేకుండా చేశాడు. వాళ్ళు తన సామంతుల దేశాలను కూడా దాటిపోయాక అతి నీచమైన ఉపాయంతో వారిని రప్పించి, శిక్ష పేరిట వారిని హత్య చేశాడు. సర్వనాశనం జరగకుండా ఉండటానికి రాజు ఒక్క పని అయినా చేశాడని చెప్పటానికి అవకాశం లేదు. అందుచేత పాపమంతా అతనిదే," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# స్త్రీకి ప్రియమైనది

ఒక రాజు ఒకనాడు తన రాణీతో సహ పుష్పవన విహారం చేస్తూండగా, "మహా రాజా, స్త్రీకి అన్నిటి కన్న ఎక్కువగా ప్రియ మైనది ఏమిటో చెప్పండి, చూతాం," అన్నది రాణి.

రాజు చుట్టూ ఉన్న పూలమొక్కలు కలయజూసి, "పూలు," అన్నాడు.

"కాదు," అన్నది రాణి.

ఆడదానికి అన్నిటి కన్న ప్రియమైనది భర్త అనీ, పిల్లలనీ, అలంకారాలనీ, చీరె లనీ ఏవేవో చెప్పాడు రాజు. అవేవీ కావ న్నది రాణి.

రాణి ప్రశ్నకు సమాధానం తెలుసుకోవా లని రాజుకు తహతహ పుట్టింది. ఆయన వెంటనే చాటింపు వేయించి, స్త్రీకి అత్యంత ప్రియమైన దేదో చెప్పి రాణిగారి చేత ఒప్పించిన వారికి వెయ్యివరహాలు బహు మాన మిస్తామని ప్రకటన చేశాడు.

మర్నాడు సభకు జనం తూగిడిలుగా వచ్చి, రాణిగారి ప్రశ్నకు సమాధానం చెబుతామన్నారు. సమాధానం రాణిగారికి అంగీకారం కాకపోతే కొరడా దెబ్బలతో శిక్షిస్తానన్నాడు రాజు. దానితో ఒక్కరు కూడా సమాధానం చెప్పకుండా తిరిగి వెళ్ళిపోయారు.

రాజుగారికి కోపం వచ్చి ఇంకో చాటింపు వేయించాడు: మర్నాడు ఉదయం రాజు గారు ఒక పావురాన్ని వదులుతారు; అది వెళ్ళి ఏ ఇంటి పైన వాలితే ఆ యింటిలో ఉండే వాళ్ళలో ఎవడో ఒకడు వచ్చి రాణి గారి ప్రశ్నకు సమాధానం చెప్పాలి; ఆ సమాధానం రాణిగారికి నచ్చకపోతే శిరశ్ఛేదం!

మొదటి చాటింపు విని జనం ఎంత ఉబలాటపడ్డారో ఈ చాటింపు విని అంతగా బెదిరిపోయారు. రాజు ఇదే విధంగా రోజూ

ఏ. జాన్ బాబు

పావురాన్ని వదిలి ఒక్కొక్క ఇంటివాణ్ణే శిరశ్ఛేదం చేస్తాడు కాబోలని వారికి భయం పుట్టుకొచ్చింది.

మర్నాడు రాజుగారు వదిలిన పావురం ఎగురుతూ వెళ్ళి, దూరాన ఒక పల్లెవాడి ఇంటి పైన వాలింది. దాని వెంట వెళ్ళిన రాజభటులు పల్లెవాడి ఇంట్లో ప్రవేశించి చూస్తే, పల్లెవాడు ఇంట లేడు, వాడి కొడుకు వల అల్లుతున్నాడు. రాజభటులు వాణ్ణి బలవంతంగా పట్టుకుని రాజుగారి వద్దకు తీసుకుపోయారు.

రాజు వాడికి విషయమంతా చెప్పి, రాణి ప్రశ్న వినిపించి, దానికి వాడు విధిగా సమాధానం చెప్పాలనీ, లేకపోతే వాడి తల తీసేస్తామనీ అన్నాడు.

"పదిహేను రోజులు గడు వియ్యండి, సమాధానం చెబుతా," అన్నాడు పల్లెవాడి కొడుకు. రాజు సరే నన్నాడు.

ఆ గడువుకాల మంతా వాడికి కాళ్ళు అరిగేటట్టు తిరగటంలోనే సరిపోయింది. వాడు ఎందరో ఆడవాళ్ళను, "ఆడదానికి అన్నిటి కన్న ఏది ఎక్కువ ఇష్టం?" అని అడిగాడు. కొందరు నగలన్నారు, కొందరు పిల్లలన్నారు, కాస్త వయసు మళ్ళినవాళ్ళు మనవలూ, మనవరాళ్ళూ ఇష్టమన్నారు. మొత్తం మీద ఒకరు చెప్పిన సమాధానం



ఒకరు చెప్పలేదు. అన్ని సమాధానాలూ అందరికీ తెలిసినవే. అలాటి సమాధానం కోసం రాజు ఇంత అర్భాటం చేస్తాడా?

గడువు ఆఖరు రోజున పల్లెవాడి కొడుకు తనకు మర్నాడు చావు తప్పదని నిశ్చయించుకుని, చెరువుగట్టున విచారంగా ఉండగా, ఒక ముసలమ్మ అటుగాపోతూ అగి, "ఏం నాయనా, అంత దిగులుగా కూర్చున్నావు?" అని అడిగింది. వాడా ముసలమ్మతో అంతా చెప్పాడు.

"రాజుగారు చేస్తున్న అర్భాటం గురించి నేను కూడా విన్నాలే, నాయనా. అదంతా చూస్తుంటే రాణిగారి ప్రశ్నకు జవాబు తెలుస్తూనే ఉందిగా!" అన్నది ముసలమ్మ.

"ఏమిటవ్వా, ఏమిటా జవాబు?" అని వాడు ఆత్రంగా అడిగాడు.

"ఇంకేముంది, నాయనా? మొగుడి పైన అధికారం. రాణీ చూడు ఆ రాజు చేత మూడు చెరువుల నీళ్ళు తాగించి ఎలా ఆనందిస్తున్నదో!" అని ముసలమ్మ కర్ర తాటించు కుంటూ పోయింది.

మర్నాడు రాజభటులు వచ్చి పల్లెవాడి కొడుకును రాజసభకు పట్టుకుపోయారు. రాజు వాణ్ణి, "అన్నిటి కన్న స్త్రీకి అత్యంత ప్రియమైన దేమిటి?" అని అడిగాడు.

"భర్త పైన అధికారం," అన్నాడు పల్లెకుర్రవాడు.

రాజు ఆ జవాబుకు నిర్ఘాంతపోయి, "నేను నమ్మను," అన్నాడు.

"రాణీగారు ఒక్క చిన్న ప్రశ్నతో మీ కెంత పని కలిగించిందో తెలిసి కూడా నమ్మరా?" అన్నాడు పల్లెకుర్రవాడు.

"వీడి సమాధానం సరయినదేనా?" అని రాజు రాణీ నడిగాడు. ఆమె ఏమీ చెప్పకుండా తల వంచుకున్నది.

వాడి సమాధానం సరయినదేనని రాజు గ్రహించి, వాడికి రెండువేల వరహాలు బహుమానం ఇచ్చి పంపేశాడు.






# మానవసహాయం

ఒకప్పుడు మలయ తీరంలో ఒక యోధాన యోధు డుండేవాడు. అతని సాహస చర్యలూ, అద్భుత పరాక్రమమూ గురించి దేశదేశాల వాళ్ళు కథలు చెప్పుకునేవారు.

ఒకనా డతను సముద్ర తీరాన పచార్లు చేస్తూండగా, ఒక మహాకాయుడు సముద్రంలో నడుస్తూ అతని కేసి వచ్చాడు. ఆ మహాకాయుడు ఒడ్డుకు వచ్చాక యోధాన యోధు డతన్ని పలకరించి, "ఎవరు నువ్వు? సముద్రం దాటి ఇటుగా ఎందు కొస్తున్నావు?" అని అడిగాడు.

"నేను మహాకాయ ద్వీపం నుంచి వస్తున్నాను. మా రాజుగారు యోధాన యోధుడి కొక కబురు చెప్పమని పంపారు," అన్నా డా మహాకాయుడు.

"ప్రస్తుతం ఆ యోధుడు వేటకు పోయి ఉన్నాడు. అతనితో ఏం చెప్పాలో చెబితే, రాగానే చెబుతాను," అన్నాడు యోధుడు.

"మహారాణిగారు ప్రసవించ బోతున్నది. లోగడ ఆమె ఇద్దరు మగ పిల్లలను కన్నది. పురిటి లోనే ఆ ఇద్దరు పిల్లలనూ ఎవరో దొంగలు ఎత్తుకుపోయారు. ఈ సారి పుట్ట బోయే బిడ్డను కాపాడటానికి యోధాన యోధుడు రావాలని మా రాజుగారి కోరిక. వెనక బిడ్డలు పుట్టినప్పుడు రాజుగారి కోట లోపలా, వెలపలా కూడా బలమైన రక్షణలు ఏర్పాటు చేశారు. అయినా దొంగలు రానేవచ్చారు, పిల్లలను ఎత్తుకుపోయారు. వాళ్ళెవరో, ఎటుగా వచ్చారో, పిల్ల లేమయారో, కొంచెం గూడా తెలియ రాలేదు," అన్నాడు మహాకాయుడు.

"సరే, యోధాన యోధుడు తిరిగి వచ్చాక ఈ సమాచారం అతనితో చెబుతాను," అన్నాడు యోధుడు.

మహాకాయుడు అతని వద్ద శలవు పుచ్చుకుని సముద్రం లోకి వెళ్ళిపోయాడు,

ఎల్. జగన్నాథరావు

మర్నాడు ఉదయం యోధానయోధుడు అదే ప్రాంతంలో షికార్లు చేస్తూ ఉండగా అతనికి ఎనిమిది మంది బుడత మనుషులు పరిగెత్తే ఆటలాడుతూ కనిపించారు. అతను వాళ్ళను పలకరించి, "ఎవరు మీరు? మీ రేం పని చేస్తారు?" అని అడిగాడు.

"మేం బుడతలం. తలా ఒక పనీ చేస్తాం. నా మటుకు నన్ను చక్రాయి అంటారు. నేను చతికిలబడ్డానంటే నన్నెవరూ కదిలించలేరు," అన్నాడు బుడతల్లో ఒకడు.

"ఏదీ, కూర్చో చూస్తాం," అన్నాడు యోధానయోధుడు. చక్రాయి నేల మీద చతికిలబడ్డాడు. యోధానయోధుడు వాణ్ణి కొంచెం కూడా కదిలించలేక పోయాడు. అతను ఆశ్చర్యపడి మిగిలిన వాళ్ళ శక్తులను గురించి కూడా అడిగాడు.

ఒకడి పేరు దివ్యకర్ణి; వాడు సముద్రం అవతల రహస్యం మాట్లాడుకున్నా ఆలకించ గలడు. మరొకడు దూరస్పర్శి; వాడు సముద్రం అవతల చీమ చిటుక్కు మంటే తెలుసుకో గలడు. నాలుగోవాడు మహాజ్ఞాని; వాడికి ప్రపంచంలో ఎక్కడ ఏది జరుగుతున్నదీ తెలుస్తుంది. అయిదోవాడు లఘుహస్తి; వాడు కోడి పొదిగే గుడ్డును కోడికే



తెలియ రాకుండా కాజెయ్యగలడు. ఆరోవాడు ఆరోహకుడు; వాడు ఈగలు పాకలేని నున్నని గోడలు కూడా ఎగబాకగలడు. ఏడోవాడు విలుకాడు; వాడు వంద రెక్కలపురుగులు ఆకాశంలో ఎగురుతుంటే, వాటిలో కావాలన్న దాన్ని బాణంతో కొట్టగలడు. ఎనిమిదోవాడు దారుబ్రహ్మ; వాడి చేతి కొక కర్ర ఇస్తే, దానితో వాడు చెయ్యలేనిది లేదు.

"భేష్, ఒక ఓడ తయారు చెయ్యాలంటే, నీ కెంత కాలం పట్టుతుంది?" అని యోధానయోధు డడిగాడు.

"నువు ఒక్కసారి గుండ్రంగా తిరిగే టంత సేపు," అన్నాడు దారుబ్రహ్మ.



యోధానయోధుడు నిలబడిన చోటనే ఒక్కసారి గుండ్రంగా తిరిగాడు. అతని వీపు సముద్రం కేసి ఉండే క్షణంలో దారు బ్రహ్మ ఒక కర్రపుల్లను సముద్రపు నీటి మీదికి విసిరాడు. యోధానయోధుడు మళ్ళీ సముద్రం కేసి తిరిగే సరికి ఒక పెద్ద ఓడ సిద్ధంగా ఉన్నది.

"నేను సముద్రం మీద మహాకాయుల దీవికి వెళ్ళబోతున్నాను. మీ రంతా నా వెంట వచ్చి నాకు సహాయం చేస్తారా?" అని యోధానయోధుడు బుడతళ్ళను అడిగాడు.

"సహాయం చేస్తాం. తూర్పు దేశాలలో మాకు తెలీని విషయం లేదు," అన్నారు వాళ్ళు. యోధానయోధుడు ఎనిమిది మంది బుడతళ్ళనూ ఓడలో ఎక్కించుకుని ప్రయాణమై, త్వరలోనే మహాకాయు లుండే దీవిని చేరాడు. మహాకాయుల రాజు యోధానయోధుడు వచ్చినందుకు పరమానందం చెంది, అతనికీ అతని అనుచరులకూ ఘనమైన స్వాగతం ఇచ్చాడు. ఆయన యోధానయోధుడితో, "మీరు సమయానికి వచ్చారు. ఇవాళే రాణి ప్రసవించింది. ఆమె ప్రసవించిన మొదటి పిల్ల లిద్దరూ పుట్టిన రోజు రాత్రే మాయమయారు. ఈ పిల్లవాడికి కూడా ఈ రాత్రే ప్రమాదం ఉన్నది," అన్నాడు.

"మీ రేమీ భయపడకండి. నేనూ, నా అనుచరులూ ఈ రాత్రి మీ బిడ్డను కాపాడతాం. కాపాడ లేని పక్షంలో మీరు నా తల తీసేయించవచ్చు," అన్నాడు యోధానయోధుడు.

రాజభవనంలో మంచి ఇనపపెట్టె లాటి గది చూసి, అందులో చంటిబిడ్డనూ, ఇద్దరు దాదులనూ ఉంచి, యోధానయోధుడూ, అతని అనుచరులూ కాపున్నారు.

మహాజ్ఞాని యోధానయోధుడితో, "బిడ్డను కాపాడలేకపోతే నీ తల ఇస్తాననటం పొరపాటయింది. ఈ బిడ్డను



ఈ రాత్రి మనం కాపాడలేం. దొంగతనం జరిగి తీరుతుంది," అన్నాడు.

"అలాగా! ఆ బిడ్డను ఎవరు ఎత్తుకు పోతారో చెప్పు," అన్నాడు యోధుడు.

"దొంగ ఈ రాజు చెల్లెలే. ముందు పుట్టిన పిల్లలను కూడా ఆమే ఎత్తుకుపోయింది. ఈ అన్నా చెల్లెళ్ళ మధ్య బద్ధ శత్రుత్వం. చెల్లెలు మంత్రాలు నేర్చినది. అదృశ్య రూపంలో కోట ప్రవేశించి, పొగ గూడు నుంచి గది లోకి చెయ్యి చాచి బిడ్డలను కాజేసింది," అన్నాడు మహాజ్ఞాని.

ఆ మాట వింటూనే చత్రాయి పొగగూడు కింది భాగంలో చతికిలబడి, "ఆ ముండ పొగగూడు కుండా చెయ్యి పెట్టిందో, ఆ చేతిని మరి తీసుకోలేదు," అన్నాడు.

అందరూ ఎవరి స్థానాల్లో వారు కూర్చున్నారు. అర్ధరాత్రి దాటాక దివ్యకర్ణి, "మహాకాయమహారాజు చెల్లెలు తన కోట నుంచి బయలుదేరుతున్నది. మొదట దొంగిలించిన పిల్ల లిద్దరినీ జాగ్రత్తగా చూసుకోమని తన నౌకర్లతో అంటున్నది," అన్నాడు. "ఆమె తన ఇంటి కప్పు కుండా పైకి వస్తున్నట్టున్నది. ఆమె ఇంటికి ద్వారాలూ గవాక్షాలూ లేవు. ఆమె కోట గోడలు గాజు లాగా నున్నగా ఉన్నాయి," అన్నాడు దూరస్పర్శి.



కొంచెం సేపయాక దివ్యకర్ణి, "వచ్చేసింది! కాపలావాళ్ళకు కనపడకుండా కోటలోకి జొరబడింది," అన్నాడు.

మరి కొద్ది క్షణాలలో పొగగూడు కుండా ఒక నల్లని చెయ్యి కిందికి దిగి రాసాగింది. అది కంటపడగానే చత్రాయి చప్పున ఆ చేతిని పట్టేసుకున్నాడు. చెయ్యి తీవ్రంగా పెనుగులాడింది, కాని ప్రయోజనం లేకపోయింది. చివరకు చెయ్యి ఊడి వచ్చేసింది. చత్రాయి ఆ చేతిని గదిలోకి లాగేశాడు. యోధుడూ, మిగిలిన బుడతళ్ళూ, దాదులూ ఆత్రంగా ఆ చేతి చుట్టూ మూగి ఆశ్చర్యంగా చూడసాగారు.





45

వా ళ్ళందరూ ఆ సందడిలో ఉన్న సమయంలో రాక్షసిముండ తన రెండో చేతిని గది లోకి పెట్టి, ఉయ్యాల తొట్టెలో ఉన్న పిల్లవాణ్ణి కాజేసి తీసుకుపోయింది.

దాదులు తొట్టె కేసి తిరుగుతూనే, "అయ్యో, బిడ్డ!" అన్నారు.

"మనం ఓడలో ఎక్కి పారిపోవటం మేలు. తెల్లవారగానే ఈ రాజు మన తలలు తీసేస్తాడు," అన్నారు బుడతళ్ళు.

"ఎందుకు పారిపోవటం? ఆ రాక్షసి వెన్నంటిపోయి, రాజుగారి ముగ్గురు బిడ్డలనూ తీసుకొద్దాం," అన్నాడు యోధానయోధుడు.

అందరూ కోట బయటికి వచ్చి, తమ ఓడలో రాక్షసి ఉండే తీరానికి చేరారు. ఆరోహకుడు లఘుహస్తిని తన భుజాల మీద ఎక్కించుకుని గబగబా కోట గోడ ఎక్కేసి, లఘుహస్తిని కోటలో దించాడు. లఘుహస్తి లోపలి నుంచి మహాకాయ మహారాజు కొడుకులను ముగ్గురినీ ఆరోహకుడికి వరసగా అందించాడు. అందరూ ఓడలో మహాకాయుల దీవికి తిరిగి వచ్చారు.

వారింకా చేరక ముందే రాక్షసి ముండ పిల్లలు మాయం కావటం తెలుసుకుని ఓడను వెంబడించి రాసాగాగింది. ఆమె ఎంత దూరం లోకి వచ్చినదీ దూరస్పర్శి ఎప్పటికప్పుడు చెబుతూనే ఉన్నాడు. చూపు మేరలోకి రాగానే విలుకాడు, బాణం వదిలి, ఆమె నుదుట ఉన్న ఒక్క కంటినీ కొట్టేశాడు. ఆ దెబ్బతో ఆ రాక్షసి చచ్చి సముద్రంలో పడిపోయింది.

తెల్లవారగానే మహాకాయ మహారాజు పురిటిగదికి పరిగెత్తుకుంటూ వచ్చి, తన ముగ్గురు పిల్లలనూ చూసి ఆశ్చర్యంతో మూర్ఛపోయినంత పని చేశాడు. ఆయన వారం రోజులపాటు తన అతిథులకు బ్రహ్మాండమైన విందులు చేసి, వారి ఓడ అంతా బహుమానాలతో నింపేసి, యోధానయోధుణ్ణీ, బుడతళ్ళనూ సాగనంపాడు.





# తలవంచినవాడు

పాపన్న ఒకసారి ఏదో పని మీద కొండ ప్రాంతాలకు వెళ్ళి తిరిగి వస్తూండగా మధ్యాన్న మయింది. ఎక్కడైనా కూర్చుని భోజనం చేద్దా మనుకుంటూ ఒక తోట వద్దకు వచ్చాడు. ఆ తోట వెనక ఒక ధని కుడి ఇల్లు కనిపించింది. తోటలో అతని కొక దృశ్యం కనబడింది. అక్కడ కట్టెలు కొట్టుతున్న ఒక మనిషి శోష వచ్చి పడు కున్నాడు. అయిదా రేళ్ళ కుర్రవా డొకడు ఆ మనిషిని లేపుతూ, "అమ్మ డబ్బులు పట్టుకు రమ్మన్నది. నా కాకలేస్తున్నది," అన్నాడు ఏడుపు ముఖంతో.

"ఏం చేసేదిరా ? ఈ కట్టెలన్నీ కొట్టితే గాని ఇంటి యజమాని డబ్బు లివ్వడు. ఎక్కడన్నా డబ్బులు ముష్టెత్తి ఏమైనా కొనుక్కుతిను. నేనీ కట్టెలు కొట్టి, డబ్బులు తీసుకు వచ్చి, మీ అమ్మకు గంజి కాచి పోస్తా," అన్నాడు తండ్రి.

"ఎవరి నడిగేది ? ఎవరిస్తారు ?" అంటూ కుర్రవాడు ఏడిచాడు.

ఇంతలో పనివాడికి పాపన్న కనిపించాడు. అతను పాపన్న దగ్గిరికి వచ్చి, "అయ్యా, మీ దగ్గిరుంటే అణో, బేడో ఇచ్చి పుణ్యం కట్టుకోండి. వీడు ఆకలికి మాడు తున్నాడు," అన్నాడు.

పాపన్న ఒక చెట్టు కిం... మూట విప్పి, కట్టెలు... కొడుకునూ కూడా తి... కలిసి భోజనం చేశాక, పాపన్న ... వాణ్ణి ప్రశ్నించి అతడి గృహ పరిస్థితులు తెలుసుకున్నాడు.

కొంత దూరంలో కట్టెలుకొట్టే వాడి గుడిసె ఉన్నది. అందులో అతడి భార్య జబ్బుగా పడిఉన్నది. ఈ ఇంటి యజమాని కట్టెలుకొట్టితే తప్ప డబ్బివ్వడు. సాయం కాలం ఆ కూలి డబ్బుల తోనే ఇతను తన



భార్యకు మందూ, తిండీ చూడాలి. ఏ రోజు ... ఆ రోజుకే చెల్లు.

...గు ముడి విప్పి చూసు... ఉండే చిల్లర అంతా ... బంగారు కాసు మిగి... పాపన్న సంకోచించకుండా ఆ బంగారు కాసును కట్టెలుకొట్టే వాడి చేతిలో పెడుతూ, "దీన్ని తీసుకుని వెంటనే వెళ్ళి మార్చి, నీ భార్యకు మంచి మందూ అదీ ఇప్పించు," అన్నాడు.

"అన్న ప్రకారం ఈ కట్టెలన్నీ కొట్ట కుండా ఎట్లా వెళ్ళను?" అన్నాడు కట్టెలు కొట్టేవాడు.



"నువు వచ్చేదాకా నేను కొట్టుతూ ఉంటాలే. కట్టెలు కొట్టటం నా కలవాటే. నీ యజమాని అడిగితే నేను చెప్పు కుంటాలే," అన్నాడు పాపన్న.

ఆటే ఇష్టం లేకుండానే కట్టెలుకొట్టే వాడు పాపన్న ఇచ్చిన బంగారు కాసు తీసుకుని, కుర్రాణ్ణి వెంట బెట్టుకుని ఇంటికి బయలుదేరాడు.

పాపన్న చొక్కా విప్పి పక్కన పెట్టి, కట్టెలు కొట్టనారంభించాడు.

కొంత సేపటికి ఇంటి యజమాని బయటికి వచ్చి, కొత్తవా డెవడో కట్టెలు కొట్టడం చూసి, "నువ్వెవరు? వా డేడీ?" అని అడి గాడు పాపన్నను.

"నేను వాడి బంధువునే లెండి. వాడి భార్యకు సుస్తీగా ఉంటే, వెళ్ళి చూసి, భోజనం చేసి వస్తానని వెళ్ళాడు. వాడు వచ్చే దాకా నేను కట్టెలు కొట్టుతా లెండి," అన్నాడు పాపన్న.

"సరే కానియ్యి. కట్టెలు బాగా కొట్టు, ఏం? నీకు వేరే కూలీ ఇమ్మంటే ఇచ్చేది లేదు, ఇప్పుడే చెబుతున్నాను," అన్నాడు ధనికుడు.

"అలా నే నెందు కడుగుతానండీ?" అన్నాడు పాపన్న.



ధనికుడు కొంచెం అవతలికి పోయి, కట్టెలుకొట్టే పాపన్నను వింతగా గమనించ సాగాడు. పాపన్న చూడటానికి కట్టెలుకొట్టే వాడి లాగా లేడు, కాని అసలు వాడి కన్న బాగా కొట్టుతున్నాడు. రేపు కూడా వీణ్ణే రమ్మనాలి అని ఇంటి యజమాని అను కుంటూండగా, అసలు కట్టెలుకొట్టే వాడు వచ్చి, పాపన్న చేతి గొడ్డలి ఇయ్యమని అడిగాడు.

"అప్పుడే వచ్చావేం?" అని పాపన్న అతన్ని అడిగాడు.

"మీరు ధర్మాత్ములై ఏం లాభం? నాబోటి దరిద్రుడికి తీసుకున్నది ప్రాప్తం ఉండొద్దూ? మీ రిచ్చిన బంగారు కాసు రొండిన దోపుకుని బయలుదేరానా? గుడ్డ చిరుగులో నుంచి జారి అది ఎక్కడ పడి పోయిందో పడిపోయింది," అన్నాడు కట్టెలు కొట్టేవాడు.

బంగారు కాసు అన్న మాట చెవిని పడ గానే ధనికుడు వాళ్ళ దగ్గిరికి అడావిడిగా వచ్చి, "బంగారు కాసేమిటి? ఎక్కడిది? దాన్ని యితగాడికి యిచ్చిన వాళ్ళెవరు?" అని అడిగాడు.

"నేనే ఇచ్చాను. దాన్ని కాస్తా పాపం, దారిలో ఎక్కడో పారేసుకున్నాడట," అన్నాడు పాపన్న.





"అదే నేనూ అడిగేది—బంగారు కాసు నీ కెక్కడిదీ అని! ఇవాళ ఉదయమే నేను పది బంగారు కాసులు బొడ్డులో పెట్టుకుని ఇంటికి వచ్చి చూసుకుంటే ఒకటి కనిపించలేదు. అది మీకు దొరికింది. దాన్నే మీలో ఒక డిచ్చినట్టూ, ఇంకోడు పారేసుకున్నట్టూ నాటకం ఆడుతున్నారు. దాన్ని ఎక్కడ దాచారో తెచ్చి ఇచ్చారా సరే సరి, లేకపోతే ఇద్దరికీ శాస్తి చేయిస్తాను," అన్నాడు ఇంటి యజమాని.

పాపన్నా, కట్టెలు కొట్టేవాడూ ఎంతగా చెప్పుకున్నా ధనికుడు వినిపించుకో లేదు. చివరకు పాపన్న, "మీ బంగారు కాసు పోయి ఉంటే, ఇక్కడో ఎక్కడో ఉంటుంది. మీరు సరిగా వెతికి ఉండరు. నా పైన అకారణంగా నింద మోపుతున్నారు గనక దాన్ని వెతికి పెడతాను. ఈ నింద మొయ్యలేను," అన్నాడు.

అతను బంగారు కాసు కోసం వెతక నారంభించాడు. ధనికుడు కట్టెలు కొట్టే వాడితో, "చూస్తూ నిలబడతా వేం? నీపని కానీ!" అని, పాపన్నను ఆసక్తితో గమనించసాగాడు. అతను ధనికుడి కంటికి విచిత్రమైన మనిషిగా కనిపించాడు. అతను లేని నాణెం కోసం నిజంగా వెతుకుతాడా, లేక వెతుకుతున్నట్టు నటించి, చివరకు తనదే ఒక బంగారుకాసు తీసి, దొరికిందని తనకు ఇస్తాడా?

సాయంత్రం దాకా వెతకగా పాపన్నకు కంచెవార బంగారుకాసు దొరకనే దొరికింది. అతను దాన్ని తెచ్చి ధనికుడికిస్తూ, "ఇదుగో నండీ మీ బంగారుకాసు. కష్టపడి వెతికితే ఎందుకు దొరకదు? ఇది దొరకబట్టీ సరిపోయింది గాని, లేకపోతే నేను నిష్కారణంగా దొంగనై ఉందునుగదా!" అన్నాడు.

ఈ లోపుగా కట్టెలు కొట్టేపని పూర్తి అయింది. ధనికుడు భార్యను కేకేసి, ఆమె చేత కట్టెలు కొట్టినవాడికి కూలి డబ్బు

లిప్పించాడు. కట్టెలు కొట్టేవాడి వెంటనే పాపన్న కూడా బయలుదేరాడు.

ధనికుడు ఉట్టుడియంగా బంగారుకాసు సంపాదించి నందుకు పొంగిపోతూ, మురిసి పోతూ ఉండగా, అతని చిన్న కొడుకు ఇంటి ముందు ఆడుకుంటూ, కెవ్వున అరిచి ఇంటికేసి పరిగెత్తుకు వచ్చాడు. ఎవరో కుర్రాళ్ళు ఒక ఆవు దూడ పైన రాళ్ళు వెయ్యగా అది బెదిరి, ధనికుడి కొడుకు కేసి వచ్చింది. దాన్ని చూసి భయపడి వాడు పరిగెత్తుతూ కింద పడ్డాడు.

ఆ కంగారులో ధనికుడు, ఊడిపోతున్న బట్టను సవరించు కుంటూ కొడుకు దగ్గిరికి ఒక్క పరుగున వచ్చాడు. ఇంటి లోపలి నుంచి, "అయ్యో, అయ్యో," అంటూ కుర్రవాడి తల్లి కూడా వచ్చింది. ఇద్దరూ తమ బిడ్డను ఇంటి లోపలికి తీసుకుపోయి, వాడి గాయాలకు మందూ మాకూ వేశారు.

ఇదంతా జరిగే సమయానికి పాపన్నా, కట్టెలు కొట్టేవాడూ చాలా దూరం వెళ్ళి పోయారు. వాళ్ళ కీ గొడవే తెలీదు. దారిలో కట్టెలు కొట్టేవాడు పాపన్నతో, "అయ్యా, మీరా ధనికుడి మాటనమ్మి, బంగారు కాసు కష్టపడి వెతికి అయన కిచ్చారు. కాని అది మీదే. దాన్ని నేను పారేసుకుంటే మీరు వెతికి ఆ మనిషి కిచ్చేశారు," అన్నాడు.





"ఎలా చెప్పగలం? నువు పారేసుకున్న కాసు ఎక్కడ పడిందో, ఎవరికి దొరికిందో, లేక యింకా పడిన చోటనే ఉన్నదో ఎవరు చెప్ప గలరు?" అన్నాడు పాపన్న.

అప్పటికి చీకటి కూడా పడిపోతూండటం చేత పాపన్న ఆ రాత్రికి కట్టెలు కొట్టేవాడి గుడిసెలోనే ఉండిపో దలిచాడు. అతనికి ఒకటే బాధగా ఉన్నది—తాను కట్టెలు కొట్టేవాడికి ఎలాటి సాయమూ చెయ్యలేక పోయాడు. అతను పారేసుకున్న కాసు కూడా వెతికి అతని కిచ్చేస్తేగాని పాపన్నకు తృప్తి కలిగేటట్టు లేదు.

మర్నాడు ఉదయం కట్టెలు కొట్టేవాడు ధనికుడి తోటకు కట్టెలు కొట్టటానికి బయలు దేరేటప్పుడు పాపన్న కూడా వెంట వచ్చాడు. పాపన్న కళ్ళు నడుస్తున్నంత సేపూ నేల పైనే ఉన్నాయి. తోట కుండా ధనికుడింటికి పోయేదారి పక్కన అతనికి బంగారు కాసు కనబడింది. పాపన్న ఉత్సాహంగా దాన్ని ఎత్తి, "చూశావా? ఊరికేనే నువు ఆ ధనికుణ్ణి తప్పుపట్టావు! ఇదుగో, నువు పారేసుకున్న కాసు. దీన్ని నువు మళ్ళీ పారేసుకోగలవు. దీన్ని మార్చి డబ్బు నీ భార్య కిచ్చి, నా తోవన నేను పోతాను," అన్నాడు.

కట్టెలు కొట్టేవాడు తోటలో కట్టెలు కొట్టుకుంటూ, ధనికుడు నేల కేసి చూస్తూ తోటంతా కారాడటం చూశాడు. పాపం, ఆ ధనికుడికి తన కొడుకు ప్రమాదం గొడవ ముగిశాక ఎంత ఆలోచించినా తాను ఉట్టుడియంగా సంపాదించిన బంగారు కాసు విషయం గుర్తురాలేదు. ఆ అడావుడిలో అది తోటలో ఎక్కడో జారి పడి పోయి ఉండాలి.

ఆ కాసు కోసం అనేక మాసాలపాటు నేలనే చూస్తూ ఇంటి పరిసరాలలో తిరగటం చేత తలవంచి, నేలను చూస్తూ నడవటం ఆయనకు అలవాటై పోయింది.





# ఎత్తుకు పై ఎత్తు

మరాళ దేశపు రాజైన శత్రుఘ్నుడు తన తండ్రి అనంతరం రాజ్యానికి వచ్చి కూడా పెళ్ళాడలేదు. అనేక మంది రాజులు తమ కుమార్తెలను అతని కివ్వటానికి సిద్ధ పడ్డారు, కాని వారిలో ఒక్కతె కూడా అతనికి నచ్చలేదు. శత్రుఘ్నుడు పెళ్ళాడ నందుకు అతని మిత్రులూ, బంధువులూ, పరివారమూ చాలా బెంగపడ్డారు.

ఇంతలో శత్రుఘ్నుడికి కుంతల రాజ కుమార్తె శోభనాంగి సాటిలేని సుందరి అనీ, ఆమెను పెళ్ళాడటానికి అనేక మంది రాజులు పోటీ పడుతున్నారనీ తెలిసింది. ఈ సంగతి తెలియగానే శత్రుఘ్నుడు ఒక వంద మంది యోధులను మాత్రం వెంట బెట్టుకుని కుంతల దేశానికి వెళ్ళాడు. అతను తన యోధులతో సహా రాజధాని పరిసరాలలో ఉండే అరణ్యంలో విడిసి, సామాన్య వేషంలో నగరంలోకి వెళ్ళి, రాజోద్యానంలో శోభనాంగిని చూసి, ఆమెను పెళ్ళాడాలని నిశ్చయించుకున్నాడు.

అతను అదను చూసి శోభనాంగిని ఒంటరిగా కలుసుకుని, తాను ఫలానా అని చెప్పి, తన కోరిక తెలియబరిచాడు.

శోభనాంగి అతనితో, "నేను చాలా కాలం క్రితమే మిమ్మల్ని గురించి విని, మనస్సులో వరించుకున్నాను. కాని ఎంత కాలం చూసినా మీరు నన్ను పెళ్ళాడాలని కోరిక ఉన్నట్టు మా తండ్రికి కబురైనా చెయ్యలేదు. ఈ లోగా నన్ను కోరి వచ్చిన రాజులందరినీ నిరాకరించాను. ఇటీవల మా తండ్రి నాతో విసిగిపోయి, నేను ఒప్పుకున్నా, ఒప్పుకోక పోయినా మా పొరుగు రాజైన బలవర్మ కిచ్చి పెళ్ళి చేస్తానని నిశ్చయించాడు. బలవర్మ నన్ను పెళ్ళాడాలని చాలా పట్టుదలగా ఉన్నాడు. అదీ గాక అతను మా సరిహద్దున ఉన్న బలవంతుడు.

ఎ. కోదండపాణి





తొందరపడ వద్దనీ, ఒక్క ఏడాది గడు వియ్యమనీ నేను మా తండ్రిని కోరాను. ఆయన సరే నన్నాడు. నేను కోరిన గడువు తీరే లోగానే మీరు వచ్చారు. ఇంక ఆలస్యం చెయ్యక మీరు మా తండ్రిని అడగండి, ఆయన నన్ను అడిగినప్పుడు, మిమ్మల్ని పెళ్ళాడటానికి సిద్ధంగా ఉన్నట్టు చెబుతాను," అన్నది.

శత్రుఘ్నుడు మర్నాడే సపరివారంగా కుంతలరాజు వద్దకు వెళ్ళి, తనకు శోభనాంగిని పెళ్ళాడాలని ఉన్నట్టు చెప్పాడు. రాజు శోభనాంగిని పిలిచి అడిగితే ఆమె తన అంగీకారాన్ని తెలియబరిచింది. రాజు నిండు సభలో శత్రుఘ్నుడికి తన కుమార్తె నిచ్చి పెళ్ళి చేయబోతున్నట్టు ప్రకటించాడు. దగ్గరలోనే పెళ్ళి ముహూర్తం ఏర్పాటయింది.

పెళ్ళి జరిగే ముందు విందులూ, వినోదాలూ వైభవంగా ఏర్పాటయాయి. అందులో శత్రుఘ్నుడి పరివారమూ, రాజుగారి బంధువులూ, నగరం లోని పెద్దలూ పాల్గొన్నారు. ఉన్న తాసనాల మీద రాజుగారూ, కాబోయే దంపతులూ కూర్చున్నారు.

అందరూ వినోదాలలో తన్మయులై ఉన్న తరుణంలో ఒక యువకుడు పరిగెత్తుకుంటూ వచ్చి, శత్రుఘ్నుణ్ణి ఉద్దేశించి, "ప్రభూ, ఒక్క మనవి!" అన్నాడు.

అందరికన్న హెచ్చు ఉత్సాహంలో ఉన్న శత్రుఘ్నుడు, "ఏం కావాలో కోరుకో," అన్నాడా యువకుడితో.

"రాజకుమార్తె శోభనాంగినీ, ఈ విందు వినోదాలనూ నా కిచ్చెయ్యండి. అడి తప్ప వద్దు," అన్నాడా యువకుడు.

శత్రుఘ్నుడు కొయ్యబారి పోయాడు. అతని నోట మాట రాలేదు.

ఆ వచ్చిన వాడు బలవర్మ. అతన్ని శోభనాంగి గుర్తించింది, కాని శత్రుఘ్నుడు మాట జారకుండా, ఆపలేకపోయింది. ఇప్పు





డామె శత్రుఘ్నుడికి రహస్యంగా విషయమంతా చెప్పి, ఏ మనాలో బోధించింది.

బలవర్మ అందరికీ వినపడేలాగా గొంతెత్తి, "ఏం మాట్లాడరు? అడి తప్పతానని చెప్పెయ్యండి," అన్నాడు.

శత్రుఘ్నుడీ లోపల శోభనాంగి సలహా విన్నాడు. అతను బలవర్మతో, "శోభనాంగి నాకు ప్రధానమై ఉన్నది గనక అమెను నీ కిచ్చే అధికారం నా కున్నది. కాని ఈ విందు వినోదాలు నావి కావు. వాటిని నీ కిచ్చే హక్కు నాకు లేదు," అన్నాడు.

శోభనాంగి తన తండ్రి చేత బలవర్మతో, "వచ్చే సంవత్సరం ఇదే రోజుకు మీరు వచ్చినట్టయితే మీకూ మా అమ్మాయికీ పెళ్ళి ఎర్పాటు చేసి, విందు వినోదాలు ఏర్పాటు చేస్తాం," అని చెప్పించింది.

శత్రుఘ్నుడి పెళ్ళి రద్దయిపోయింది. అతను శోభనాంగి తోనూ, అమె తండ్రి తోనూ ముందు జరగవలిసినదాన్ని గురించి సంప్రతించి, పరివారంతో వెళ్ళిపోయాడు.

ఏడాది గడిచింది. శోభనాంగికీ, బలవర్మకూ పెళ్ళి జరగవలిసిన రోజు వచ్చింది. అ పెళ్ళి సందర్భంలో జరిగిన విందు వినోదాలకు శత్రుఘ్నుడు తన నూరుగురు యోధుల తోనూ హాజరయాడు. అయితే



అందరూ మారు వేషాలలో ఉన్నారు. శత్రుఘ్నుడు చింకిబట్టలు ధరించి, ముసలి వేషం వేసుకుని దూరాన బిచ్చగాళ్ళ మధ్య నిలబడి ఉన్నాడు. అతని చేతిలో ఒక చిన్న సంచీ ఉన్నది. వినోదాలు పూర్తి అయి విందు ప్రారంభం కాసున్న సమయంలో అతను బలవర్మను సమీపించి, "ప్రభూ, ఒక్క మనవి!" అన్నాడు.

"నా పరివారాన్నీ, నాకు కాబోయే భార్యనూ తప్ప ఏ మడిగినా ఇస్తాను," అన్నాడు బలవర్మ.

"మా పేదవాళ్ళకు అవన్నీ ఎందుకు, దొరా. ఈ సంచీ నిండా తిండి నించండి.

పేదవాళ్ళం పంచుకు తింటాం," అన్నాడు శత్రుఘ్నుడు.

బలవర్మ తన సేవకులను పిలిచి, "ఈ ముసలివాడి సంచీ నిండా ఆహార పదార్థాలు నింపండి," అన్నాడు.

శత్రుఘ్నుడు తెచ్చినది మడత సంచి. అది చూడటానికి మూరెడెత్తే ఉన్నట్టున్నది గాని, మడతలు విప్పుకుంటూ పోతే రెండు నిలువుల లోతుంటుంది. నౌకర్లు ఆహార పదార్థాలు తెచ్చి సంచిలో పోస్తున్న కొద్ది శత్రుఘ్నుడు దాని ఒక్కొక్క మడతే విప్పి, ఇంకా ఖాళీ ఉన్నట్టు చూపుతున్నాడు.

అతనా సంచిని నడుమెత్తు విప్పేసరికే బలవర్మ కంగారు పడ్డాడు. అది నించితే ఇంక అతిథులకు ఆకే మిగిలేటట్టు లేదు.

బలవర్మ కంగారు చూసి శత్రుఘ్నుడు, "దొరా, తమరు అన్నమాట నిలబెట్టుకో వాలని నేను పట్టు బట్టను. తమరీ సంచీలో వేసిన పదార్థాలన్నీ కలయ దొక్కి, 'ఇంక చాలు, సంచీ నిండింది,' అన్నారంటే నేను తృప్తి పడతాను," అన్నాడు.

బలవర్మ సంచీలో కాళ్ళు పెట్టి తొక్కుతూ, "ఇంక చాలు, సంచీ నిండింది," అన్నాడు. ఆ క్షణంలోనే శత్రుఘ్నుడు సంచీ మడతలు పూర్తిగా విప్పి, బలవర్మను అందులో బంధించి, మూతి బిగించాడు.

అతను ఈల వేసేసరికి అతని యోధులు చప్పున తమ స్థానాలలో నుంచి లేచి బలవర్మ పరివారాన్నందరినీ బంధించారు.

శత్రుఘ్నుడు తన ముసలివేషం విప్పేసి తాను శోభనాంగిని పెళ్ళాడటానికి సిద్ధంగా ఉన్నానని ప్రకటించాడు. అతన్ని అడ్డే వారెవరూ లేరు. వారిద్దరి పెళ్ళి నిరాటంకంగా జరిగిపోయింది.

పెళ్ళి కాగానే శత్రుఘ్నుడు బలవర్మనూ, అతని పరివారాన్నీ విముక్తులను చేసి పంపేశాడు. తరవాత బలవర్మ ముఖం కుంతల రాజ్యం చాయల ఎక్కడా కనిపించలేదు.





# సాహసికురాలు

ఒక గ్రామంలో ఒక నిరుపేద కుటుంబం ఉండేది. అందులో అనేకమంది కూతుళ్ళూ, కొడుకులూ ఉండేవారు. వాళ్ళ తండ్రి ఎంత ఒళ్ళు విరుచుకుని పని చేసినా పిల్లలందరికీ తిండీ బట్టా సమకూర్చటం సాధ్యం కాలేదు. ఒక్కచిక్కిన వాళ్ళ తల్లి అష్టకష్టాలూ పడుతూ చిరిగిన బట్టలను కుట్టుతూనే ఉండేది.

ఈ పరిస్థితి రాను రాను దుర్భరమై ఆ పేద తల్లిదండ్రులు తమ పెద్ద సంతానమైన ఆడపిల్లలు ముగ్గురినీ ఇంటి నుంచి పంపించేస్తూ, "ఇక మీ దారి మీరు చూసుకుని, మీ పొట్టలు మీరు పోసుకోండి," అని చెప్పేశారు. ఇల్లు నరకంగా ఉండటం చేత ఆ ఆడపిల్లలకు తమ బతుకు తాము బతకటానికి అభ్యంతరం లేక పోయింది. వాళ్ళు అడవి దాటి అవతలి దేశానికి పోదామని బయలుదేరారు.

వాళ్ళు రోజల్లా అడవి కుండా ప్రయాణించి, ఆకలితో నకనక లాడుతూ అవతలికి చేరుకునే సరికి చీకటి పడింది. అడవి అంచున వారి కొక ఇల్లు కనిపించింది. వాళ్ళా ఇంట్లోకి తొంగి చూసే సరికి ఒక స్త్రీ కనిపించింది. వాళ్ళామెను ఇంత తిండి పెట్టమని బతిమాలారు.

"మీ రిక్కడి కెందుకు వచ్చారు? నా భర్త రాక్షసుడు. మిమ్మల్ని చూస్తే తినేస్తాడు," అన్నదా స్త్రీ.

"మా కేమీ భయం లేదు. అలిసిపోయి ఆకలితో అలమటిస్తున్నాం," అన్నారు ఆడపిల్లలు.

రాక్షసుడి భార్య కొంచెం ఆలోచించి, "సరే, లోపలికి రండి. మీకు భోజనం పెడతాను," అన్నది. వాళ్ళు ఆమె పెట్టిన భోజనం తిని కాస్త నత్తుప తెచ్చుకుని, వెళ్ళిపోయి ఆ రాత్రికి ఎక్కడన్నా పడు

టి. శేషగిరిరావు





కుందామను కుంటుండగా, ఇంటి బయట పెద్దగా అడుగుల చప్పుడయింది.

రాక్షసుడి భార్య చప్పున ఆ ముగ్గు రాడ పిల్లలనూ దాచేసింది. రాక్షసుడు లోపలికి వస్తూనే, "నరవాసన వస్తున్నదే!" అన్నాడు.

"నీ కెప్పుడూ నరవాసనే. ముందు తిండి తిను, నీ కొక మంచి వార్త చెబు తాను," అన్నది వాడి భార్య. రాక్షసుడు తిండి తిన్నాక ఆమె తాను దాచిన ముగ్గు రమ్మాయిలనూ వాడి ముందుకు తెచ్చి, "వీళ్ళు మంచి పిల్లలు, భోజనం పెట్టాను. రాత్రికి మన అమ్మాయిలతో బాటే పడు కుంటారు," అన్నది.

రాక్షసుడికి కూడా ముగ్గురు కూతు ళ్ళున్నారు. వాళ్ళతోనే వీళ్ళుకూడా పడు కున్నారు. అందరూ పడుకున్నాక రాక్షసుడు వచ్చి తన కూతుళ్ళ మెడలో పూసల హారాలు వేసి, పేద అప్ప చెల్లెళ్ళు ముగ్గురి మెడలోనూ తాళ్ళహారాలు వేసి, దీపం తీసుకుని వెళ్ళిపోయాడు. ఈ సంగతి అప్ప చెల్లెళ్ళలో అందరికన్న చిన్నదైన మల్లిక కనిపెట్టింది. అందుచేత ఆమె అందరూ నిద్రపోయిన దాకా బలవంతాన మేలుకుని ఉండి, రాక్షసుడి కూతుళ్ళ మెడలోని హారాలుతీసి తన మెడలోనూ, తన అక్కల మెడలలోనూ వేసి, తమ మెడలలో ఉన్న తాళ్ళు రాక్షసుడి కూతుళ్ళ మెడలలో వేసింది.

నిశిరాత్రివేళ రాక్షసుడు వచ్చి, అందరి మెడలూ తడివి, తాళ్ళహారాలు గల తన కుమార్తెలు బయటి నుంచి వచ్చిన పిల్ల లనుకుని, వాళ్ళనుఅవతలికి తీసుకుపోయి, గదతో తలలుచితకకొట్టి చంపేసి, భయం కరంగా నవ్వి, వెళ్ళిపోయాడు.

మల్లిక అక్క లిద్దరూ కంగారుపడుతూ లేచారు. మల్లిక వాళ్ళను మాట్లాడ వద్దని చెప్పి, వాళ్ళను వెంట బెట్టుకుని అప్పటి కప్పుడే ప్రయాణమయింది.



తెల్లవారేసరికల్లా వారు అడవి అవతల ఉండే ఒక రాజుగారింటికి చేరారు. మల్లిక ధైర్యంగా రాజుగారి దగ్గిరికి వెళ్ళి, "మేం ముగ్గురమూ పేద అప్ప చెల్లెళ్ళం. ఇప్పుడే ఒక ఘోర రాక్షసుడి నుంచి ప్రాణాలతో పారిపోయి వస్తున్నాం. మీ రాజ్యంలో అలాటి రాక్షసుణ్ణి ఉండనివ్వటం చాలా అన్యాయం," అన్నది.

"అనటం తేలికే, కాని వాడి దగ్గిర కొన్ని మంత్రపు సాధనాలున్నాయి. వాడి కొక కత్తి ఉన్నది. దాన్ని ఎవరైనా సంగ్రహించ గలిగితే వాడిబలం సగం పోతుంది," అన్నాడు రాజు.

"నేను ప్రయత్నిస్తాను. రాక్షసుడి కత్తి తెస్తే ఏమిస్తారు?" అన్నది మల్లిక.

"మీ పెద్దక్కను నా పెద్ద కొడుక్కు చేసుకుంటాను. సరా?" అన్నాడు రాజు.

అందుకు మల్లిక ఒప్పుకున్నది. రాజు ఆ ముగ్గురు పిల్లలకూ తన భవనం లోనే భోజనం ఏర్పాటు చేయించాడు.

ఆ రాత్రి మల్లిక ఒంటరిగా రాక్షసుడి ఇంటికి బయలుదేరి, రాక్షసుడి కత్తి వాడు పడుకునే మంచం పక్కనే ఉండటం గమనించి, వాడు తిండితినే సమయంలో వాడి మంచం కింద దూరి దాక్కున్నది. రాక్షసుడు భుక్తాయాసంతో వచ్చి మంచం





నది. దానిమీద రాక్షసుడు అడుగు పెట్టాడో, తాడు తెగి అగాధంలో పడి చస్తాడు. అందు చేత వాడు పళ్ళు పట పట కొరుకుతూ, "ఈసారి యిటుగా వచ్చావో నీ ప్రాణాలు తీస్తాను," అన్నాడు.

"మళ్ళీ వస్తాను, మళ్ళీ వస్తాను. ఏం చేస్తావో చూస్తాను," అంటూ మల్లిక రాజుగా రింటికి వెళ్ళిపోయింది.

రాక్షసుడి కత్తి దొరికినందుకు, రాజు ఎంతో సంతోషించి, తన వాగ్దానం ప్రకారం మల్లిక పెద్ద అక్కను తన పెద్ద కొడుక్కు చేసుకున్నాడు. తరవాత ఆయన మల్లికతో, "మల్లికా, ఆ రాక్షసుడి దగ్గిర ఒక తోలు సంచీ ఉన్నది. దాన్నికూడా తెచ్చావంటే నీ రెండో అక్కను నా రెండో కొడుక్కు చేసుకుంటాను," అన్నాడు.

సాహసికురాలైన మల్లిక సరే నని మరొక రాత్రి రాక్షసుడింటికి వెళ్ళి, వాడు తిండి తినే సమయంలో వాడి మంచం మీద తడిమి చూసింది. రాజుగారు చెప్పిన తోలుసంచి రాక్షసుడి దిండు కిందనే ఉన్నది. కాని ఆమె దాన్ని తీసుకుని పారిపోయే వ్యవధి లేకుండానే రాక్షసుడి అడుగులు వినిపించే సరికి, ఆమె వాడి మంచం కింద దూరి దాక్కున్నది.

మీద పడుకుని వెంటనే ఘోరంగా గురక పెట్టసాగాడు.

మల్లిక మంచం కింది నుంచి వచ్చేసి, రాక్షసుడి కత్తి తీసుకుని, అడుగులో అడుగు వేసుకుంటూ బయటికి వచ్చింది. కాని దురదృష్ట వశాన కత్తి ద్వార బంధానికి తగిలి చప్పుడయింది. ఆ చప్పుడుకు రాక్ష సుడు లేచి, కత్తి తీసుకుని పరిగెత్తే మల్లికను చూసి వెంబడించాడు. వాడు తనను అందుకునే లోపుగా మల్లిక చెంగు చెంగున లేడి పిల్లలా పరిగెత్తుతూ తాటి వంతెన మీదికి వచ్చి, అవతలి గట్టు చేరింది. ఆ వంతెన ఒకే ఒక తాడుతో వేసి

రాక్షసుడు మంచం మీద నడుము వాలుస్తూనే గురక పెట్టి నిద్రపోయాడు. కొంచెం సేపు గడవనిచ్చి మల్లిక మంచం కిందినుంచి వచ్చి, వాడి దిండు కిందనుంచి తోలుసంచీని సులువుగానే తీసెయ్య గలిగించి. అయితే ఆమె ద్వారం వద్దకు పోతూండగా చీకటిలో ఆమె కాలికి ఒక కుండ తగిలి, అది దొర్లి చప్పుడు చేసింది. రాక్షసుడు నిద్ర లేచి మల్లికను తరిమాడు. అయినా ఈ సారి కూడా మల్లిక వాడికి చిక్కేలోగా తాటి వంతెన మీదికి వచ్చెయ్యటం చేత వాడామెను ఏమీ చెయ్యలేక పోయాడు.

మల్లిక తెచ్చిన తోలుసంచీ తీసుకుని, రాజుగారు మల్లిక చిన్న అక్కను తన రెండో కొడుక్కు చేసుకున్నాడు.

పెళ్ళి అడావుడి ముగియగానే రాజు మల్లికతో, "మల్లికా, రాక్షసుడి వేలికి ఒక ఉంగరం ఉన్నది. దాన్ని కూడా తీసుకురా గలిగితివా రాక్షసుడి బాధ పూర్తిగా పోయినట్టే. దాన్ని తీసుకురావటం చాలా ప్రమాదకరం. కాని ఎలాగయినా తీసుకురా గలిగితివా నిన్ను నా మూడో కొడుక్కిచ్చి చేసుకుంటాను," అన్నాడు.

"ఆ ఉంగరంతో రాక్షసుడి ఆట కట్టయేటట్టుంటే, ఎంత ప్రమాదమైనా వెనకాడను.



నేను వెళ్ళి వాడి ఉంగరం తెస్తాను," అన్నది మల్లిక.

ఆమె మరోసారి రాత్రిపూట బయలుదేరి వెళ్ళి రాక్షసుడి ఇంట ప్రవేశించి, మంచం కింద దాక్కున్నది.

రాక్షసుడు తిండి తిని వచ్చి, పడుకుని గురక పెట్టి నిద్రపోయాడు. మంచం మీది నుంచి కిందికి వేళ్ళాడే వాడి చేతిన ఉంగరం ఉన్నది. ఆమె ఎంతో నేర్పుగానే ఆ ఉంగరాన్ని వాడి వేలి నుంచి ఊడదీసింది, కాని ఉంగరం ఊడి ఆమె చేతిలో పడే సమయానికి వాడు లేచి ఆమెను పట్టేసుకుని, "అహా! దొరికావా?" అన్నాడు.

"అవునండి," అన్నది మల్లిక చిన్న గొంతుతో.

"ఈ సారి వస్తే ప్రాణం తీస్తానన్నానా?" అన్నాడు రాక్షసుడు.

"అన్నారండి," అన్నది మల్లిక ఇంకా హీనస్వరంతో.

"నువ్వింత తెలివిగల దానివి గదా, ఒక్క విషయం అడుగుతాను, చెప్పు. నువే నన్ను పట్టుకుని ఉంటే ఏంచేసి ఉందువు?" అని రాక్షసు డడిగాడు.

"మిమ్మల్ని ఒక పెద్ద గోతంలో వేసి, ఆ గోతం లోనే ఇంకా ఒక కుక్కనూ, ఒక పిల్లినీ, ఒక కత్తెరనూ, ఒక దబ్బనాన్నీ, పురికొసనూ వేసి, గోతం మూతి బిగించి కట్టి, అడివిలో చెట్టు నుంచి పెద్ద కొమ్మ విరుచు కొచ్చి, కర్రచేసి, దానితో స్పృహ తప్పే దాకా బాది ఉందును," అన్నది మల్లిక.

"నన్నలా చేస్తావేం? సరే, నేను నిన్ను అచ్చు అలాగే చేస్తాను," అంటూ రాక్షసుడు ఒక గోతం తెచ్చి, అందులో ఒక కుక్కనూ, పిల్లినీ, కత్తెరనూ, దబ్బనాన్నీ, పురికొసనూ వేసి, గోతం మూతి బిగించి, కర్ర తీసుకు రావటానికి అడవి కేసి పరిగెత్తుకు వెళ్ళాడు.

మల్లిక కత్తెరతో గోతం కత్తిరించి బయటికి వచ్చి, రాక్షసుడి ఉంగరం తీసుకుని తన దారిన తాను వెళ్ళిపోయింది.

కొంచె సేపట్లో రాక్షసుడు ఒక చెట్టుకు చెట్టే విరుచుకొచ్చి, దానితో ఖాళీ గోతాన్ని బాద సాగాడు.

మల్లిక రాక్షసుడి ఉంగరం తెచ్చి ఇవ్వగానే రాజు ఆమెను తన మూడో కొడుక్కు చేసుకున్నాడు.

కూతుళ్ళు పోయి, కత్తీ, సంచీ, ఉంగరమూ పోయి రాక్షసుడు జీవచ్ఛవం లాగా అయిపోయాడు. అటు తరవాత వా డెవరినీ బాధించ లేదు. వా డేమైపోయాడో కూడా ఎవరికీ తెలియరాలేదు.






తన మనమలు ముగ్గురూ బ్రహ్మ వల్ల వరాలు పొందిన సంగతి పాతాళంలో ఉన్న సుమాలికి తెలిసింది. భయం తీరిపోయి అయన తన మంత్రులైన మారీచ, ప్రహస్త, విరూపాక్ష, మహోదరులను వెంటబెట్టుకుని అట్టహాసంగా బయలుదేరి రావణుడి వద్దకు వచ్చి, అతన్ని కౌగలించుకుని, "బాబూ, ఇంత కాలానికి నా కోరిక పండింది. ఏ విష్ణుమూర్తి భయం చేత మేం లంకను విడిచిపెట్టి పాతాళానికి వెళ్ళిపోయామో ఆ విష్ణు భయం పోయింది, ఎందుకంటే నీవు బ్రహ్మ నుంచి ఉత్తమ వరాలు పొందావు. అసలు లంక మన రాక్షసులదే. దాన్ని బుద్ధిశాలి అయిన నీ సవతి అన్న కుబేరుడు ఆక్రమించి కూర్చున్నాడు. వీలును బట్టి మంచి మాటలతోనో, లంచం పెట్టో, బలాత్కారంగానో నీవు మీ అన్న వద్ద నుంచి లంకను తిరిగి సంపాదించు. నిక్షేపంగా నీవే లంకకు రాజుగా ఉండు. ఇలా చేశావంటే దిక్కు లేకుండా ఉన్న రాక్షసవంశాన్ని ఉద్ధరించిన వాడి వవుతావు," అన్నాడు.

అంతా విని రావణుడు, "అదేమిటి, తాతా? కుబేరుడు మాకు తండ్రితో సమానుడు. నీ విలా అనకూడదు, నేను వినకూడదు," అన్నాడు. సుమాలి ఇంకేమీ అనలేకపోయాడు. ఆ తరవాత, సుమాలి మంత్రులలో ఒకడైన ప్రహస్తుడు రావణుణ్ణి ఒంటరిగా పట్టుకుని ఈ విధంగా నూరిపోశాడు:



" అబ్బాయీ, నీవు మీ తాతగారితో అన్న మాట భావ్యంగా లేదు. శూరు డైన వాడికి అన్నదమ్ము లన్న విచక్షణ ఏమిటి? అన్న దమ్ముల వైరం ఆది నుంచీ వస్తున్నదే. అదితీ, దితీ అక్కచెల్లెళ్ళే. ఇద్దరూ కశ్యప బ్రహ్మకు భార్యలై దేవతలనూ, రాక్షసు లనూ కన్నారు. కాని విష్ణువు రాక్షసులను చావగొట్టి మూడు లోకాలూ దేవతలకు కట్ట బెట్టాడు. ఈ లంకే గాక, భూమండలం యావత్తూ ఒకప్పుడు రాక్షసులే అనుభవిం చారు. మేం నిన్ను కొత్తగా తప్పు పని చెయ్యమని చెప్పటం లేదు. ఈ దుర న్యాయం అదివరకు జరుగుతూ వస్తున్నదే.



అందుచేత నేను చెప్పినట్టు చెయ్యి మన వాళ్ళందరూ సుఖపడతారు."

రావణుడు కొంచెం సేపు ఆలోచించి సరే నన్నాడు. అతను ప్రహస్తుణ్ణి దూతగా కుబేరుడి వద్దకు పంపి, యిలా అడిగించాడు:

"అన్నా, ఇప్పుడు నీ అధీనంలో ఉన్న లంక అసలు రాక్షసులది. అందుచేత నీవు లంకను రాక్షసుల కిచ్చేసినట్టయితే ధర్మంగా వర్తించిన వాడి వవుతావు, తమ్ముడి నైన నా ముద్దు తీర్చిన వాడివీ అవుతావు."

ప్రహస్తుడు వచ్చి ఈ మాటలు రావణుడి తరఫున చెప్పగానే కుబేరుడు రావణుడితో తన మాటగా ఇలా చెప్పమన్నాడు: "తమ్ముడూ, మన తండ్రి నా కీ లంకా నగరా న్నిచ్చినప్పు డక్కడ రాక్షసు లెవరూ లేరు. నేనూ, నా యక్షులూ ఇక్కడ ఉంటున్నాం. నా రాజ్యమూ, నా పట్ట ణమూ, నా ఐశ్వర్యమూ నీది కాదా? వచ్చి హాయిగా రాజ్య మేలు. ఒక తండ్రి బిడ్డల మైన మన మధ్య తేడాలు దేనికి?"

ఈ మాటలు చెప్పి ప్రహస్తుణ్ణి పంపేసి, కుబేరుడు పుష్పక మెక్కి తన తండ్రి వద్దకు వెళ్ళి జరిగిన సంగతి చెప్పాడు.

విశ్రవసుడు కుబేరుడు చెప్పిన దంతా విని, "నాయనా నే నొకటి చెబుతాను



విను. రావణు డీ మాట నాతో అంటే కోప్పడ్డాను. వాడి కిప్పుడు వరాలు రావటం చేత ఒళ్ళు తెలియకుండా ఉంది. నీవు మటుకు లంకను విడిచిపెట్టి, కైలాస పర్వతం మీదికి వెళ్ళి, అక్కడ నివాసం ఏర్పాటు చేసుకో. అక్కడ మందాకినీ నదిలో బంగారు తామరపువ్వు లున్నాయి. ఆ పర్వతం మీద ఎప్పుడూ దేవతలూ, గంధర్వులూ, అప్సరలూ, ఉరగులూ, కిన్నరులూ విహరిస్తూ ఉంటారు. ప్రస్తుతం రావణుడితో వైరం మటుకు పెట్టుకోకు," అని సలహా ఇచ్చాడు.

కుబేరుడు తండ్రి మాట పాటించి, తన భార్యనూ, బిడ్డలనూ, మంత్రులనూ, పరివారాన్నీ, ధనాన్నీ, వాహనాలనూ వెంటబెట్టుకుని కైలాస పర్వతానికి వెళ్ళిపోయాడు.

ప్రహస్తుడు రావణుడి వద్దకు పరమానందంతో వెళ్ళి, "రావణా, లంక ఖాళీ అయింది. కుబేరుడు అక్కడి నుంచి పరివారంతో సహా వెళ్ళిపోయాడు. అక్కడికి వెళ్ళి మమ్మల్నందరినీ పెట్టుకుని రాజ్యం చెయ్యి," అన్నాడు.

రావణుడు తన తమ్ములనూ, బలగాన్నీ వెంటబెట్టుకుని లంకకు వెళ్ళాడు. అక్కడ అతనికి వైభవంగా రాజ్యాభిషేకం జరిగింది.



రాక్షసులతో క్రిక్కిరిసిన లంకకు కళ వచ్చినట్టయింది. ఇవతల రావణుడు లంకా నగరాన్ని పాలిస్తుంటే అవతల అతని అన్న అయిన కుబేరుడు అలకా నగరాన్ని పాలించసాగాడు.

లంకా రాజ్యాధిపత్యం పొందాక రావణుడు తన చెల్లెలైన శూర్పణఖను కాలకేయ వంశంలో పుట్టిన విద్యుజ్జిహ్వు డనే వాడి కిచ్చి పెళ్ళి చేశాడు.

కొంత కాలం గడిచాక రావణుడు వేటకు వెళ్ళి అరణ్యంలో ఒక పెద్దమనిషినీ, ఆయన వెంట ఉన్న ఒక అమ్మాయినీ చూసి, "మీ రెవరు? నిర్జనమైన ఈ అర



ణ్యంలో ఈ పిల్లను వెంటబెట్టుకుని ఎందుకు తిరుగుతున్నావు?" అని అడిగాడు.

దానికా పెద్దమనిషి ఇలా చెప్పాడు:

"నాయనా, నేను దితి కొడుకును. నా పేరు మయుడు. నీవు హేమ అనే అప్సరస గురించి వినే వుంటావు. దేవతలు నాకా హేమ నిచ్చి పెళ్ళిచేశారు. ఈ పిల్ల మా ఇద్దరికీ పుట్టిన కూతురు. దీని పేరు మందోదరి. పధ్నాలు గేళ్ళ క్రితం హేమ నన్ను విడిచిపెట్టి స్వర్గానికి వెళ్ళిపోయింది. ఈ పిల్లకు తగిన భర్తను వెతుక్కుంటూ బయలుదేరాను. ఈ పిల్ల కాక మరి ఇద్దరు కొడుకులు కూడా నాకు హేమ వల్ల కలి



గారు. ఒకడి పేరు మాయావి, రెండో వాడి పేరు దుందుభి. నా సంగతి అడిగావు గనక చెప్పాను. నీ సంతతి కూడా కాస్త చెబుతావా ఏమిటి?"

"నేను పులస్త్యబ్రహ్మ మనమణ్ణి, విశ్రవో బ్రహ్మ కొడుకును. నా పేరు దశగ్రీవుడు," అన్నాడు రావణుడు.

రావణుడు మహర్షుల వంశంలో పుట్టాడని తెలియగానే మయుడు తన కుమార్తెను అతని కిచ్చి పెళ్ళి చెయ్యటానికి సిద్ధపడ్డాడు. రావణుడు సరే నన్నాడు. అక్కడే అప్పుడే అగ్నిని ప్రజ్వలింపజేసి, మయుడు తన కూతురి చెయ్యి రావణుడి చేతిలో పెట్టి, అగ్నిసాక్షిగా ఆ ఇద్దరికీ వివాహం చేశాడు. అప్పుడే ఆయన తన అల్లుడికి ఒక మహా శక్తిని ఇచ్చాడు. అది ఎంతో తపస్సు చేయగా లభించిన ఆయుధం; దానితోనే రావణుడు లక్ష్మణుణ్ణి మూర్ఛపోగొట్టాడు.

రావణుడు తన భార్యతో సహా లంకకు వెళ్ళి, తన తమ్ముల పెళ్ళి ప్రయత్నాలు చేశాడు. వైరోచనుడి మనుమరాలు వజ్రజ్వాల అనే దాన్ని కుంభకర్ణుడికీ, శైలూషుడనే గంధర్వరాజు కూతురు సరమ అనే దాన్ని విభీషణుడికీ నిశ్చయించి వైభవంగా పెళ్ళి చేశాడు.





ముగ్గు రన్నదమ్ములూ లంకలో తమ భార్యలతో సుఖంగా కాపరం చేస్తుండగా రావణుడి భార్య మందోదరి మేఘనాదుణ్ణి కన్నది. ఆ కుర్రవాడు భూమి మీద పడుతూనే ఉరిమి నట్టుగా ఏడ్చాడట. అందుకని వాడికి మేఘనాదు డని పేరు పెట్టుకున్నారు. ఆ కుర్రవాడంటే తల్లిదండ్రు లకు ఎంతో ప్రేమ. ఆ మేఘనాదుడే లక్ష్మ ణుడి చేతిలో చచ్చిన ఇంద్రజిత్తు.

ఒకనాడు రావణుడు కొలువు తీరి ఉండగా కుంభకర్ణుడు బ్రహ్మాండంగా ఆవ లించి, "అన్నా, నాకు నిద్ర ముంచుకొస్తు న్నది. నేను పడుకోవటాని కేదన్నా ఏర్పాటు చెయ్యి," అన్నాడు. అది బ్రహ్మ వరం వల్ల ఆవహించిన నిద్ర.

రావణుడు కుంభకర్ణుడి కొక నిద్రా భవనం అద్భుతంగా కట్టించి ఇచ్చాడు. అది చాలా వెడల్పూ, అంతకు రెండింతలు పొడుగూ కలిగి, స్ఫటిక శిలా స్తంభాలూ, దంతపు తోరణాలూ అమర్చి, బంగారమూ, మణులూ పొదిగినటువంటిది. కుంభకర్ణుడు అందులో పడుకుని సంవత్సరాల తరబడి నిద్రపోయాడు.

ఒకవంక కుంభకర్ణుడు అలా పడి నిద్ర పోతుంటే రావణుడు తన అసాధారణ



బలాన్ని అండ చేసుకుని, దేవతలనూ, ఋషులనూ, యక్షులనూ, గంధర్వులనూ యథేచ్ఛగా బాధించ సాగాడు. మదించిన ఏనుగు నీటిలో ప్రవేశించి కెలికినట్టుగా రావణుడు నందనోద్యానం మొదలైన దేవతల ఉద్యానాలను ధ్వంసం చేశాడు.

తన తమ్ముడు చేస్తున్న పనులు దూష్య మైనవని బాధపడి, కుబేరుడు, తన వంశ గౌరవానికి తగిన బోధలను తమ్ముడికి చేయ దలచి, రావణుడి వద్ద కొక దూతను పంపాడు. ఆ దూత లంకకు వచ్చి, ముందుగా విభీషణుణ్ణి చూశాడు. విభీష ణుడు దూతకు తగిన గౌరవ మర్యాదలు







జరిపి, కుబేరుడు మొదలైన వారి క్షేమ సమాచారాలు అడిగి కనుక్కొని, అతను వచ్చిన పని తెలుసుకున్నాడు. తరవాత అత నా దూతను నిండు సభలో రావణు డికి పరిచయం చేశాడు.

దూత కుబేరుడి మాటలుగా రావణుడితో ఇలా అన్నాడు :

"తమ్ముడా, ఇప్పటికే నీకు చాలా కీర్తి వచ్చింది. అంతతో తృప్తిపడు. ఇక నుంచీ సాధ్యమైన మేరకు సాధు మార్గాన నడ వటం మంచిది. నీవు ధ్వంసం చేసిన నందనవనాన్ని నేను కళ్ళారా చూశాను. ఋషులను చంపావని విన్నాను. నీ చేత పీడించబడిన దేవతలు నీపై పగ తీర్చుకునే ప్రయత్నంలో ఉన్నట్టు తెలుస్తున్నది. నే నీ మధ్య రౌద్రవ్రతాన్ని నియమంగా చెయ్యగోరి హిమాలయానికి వెళ్ళి, అక్కడ శివుడితో ఉన్న పార్వతిని చూశాను. మరే ఉద్దేశమూ లేకుండానే, పార్వతి సౌందర్యానికి బందీ అయి నా ఎడమ కన్ను ఆమె పైన పడింది. వెంటనే నా కన్ను దగ్ధమై, పింగళ వర్ణం పొందింది. తరవాత నేను అపారమైన ఆ పర్వతం మీద మరొక చోటికి వెళ్ళి రౌద్ర వ్రతం అవలంబించాను. వ్రత నియమం పూర్తి కాగానే ఈశ్వరుడు మెచ్చి, తాను ఒకప్పు డీ వ్రతం చేసినట్టూ, అనం తరం నేను మాత్రమే ఈ వ్రతాన్ని పూర్తి చేసినట్టూ చెప్పి నన్ను తన స్నేహితుడుగా వుండమని కోరాడు. ఆయన నాకు ఏకాక్షీ పింగళు డనే పేరు కూడా పెట్టాడు. ఆయన వద్ద సెలవు పుచ్చుకుని ఇంటికి వచ్చే సరికి నీవు చేసే దుష్కృత్యాల మాట చెవిన పడింది. వంశానికి అపఖ్యాతి తెచ్చే ఇలాటి పనులు మాను, నాయనా. ఋషులూ, దేవతలూ చేరి నీ చావుకు ఉపాయ మాలో చిస్తున్నట్టు వింటున్నాను కూడా."

కుబేరుడి మాటలను ఈ విధంగా దూత చెప్పే సరికి రావణుడు ఆగ్రహావేశంతో,





"ఓరీ, దూతా! ఈ మాటలు చెప్పిన నిన్నూ, చెప్పించిన నా అన్ననూ ఏం చేస్తానో చూడు. కుబేరుడా నాకు హితబోధ చేసేది? తనకు శివుడి స్నేహం దొరికిందని కబురు చేస్తాడా? పెద్దవాడూ, తండ్రిలాటివాడూ అని ఇంత కాలమూ చంపక మన్నించాను. నీ మాటలు విన్నాక మూడు లోకాలూ జయించాలని బుద్ధి పుట్టుతున్నది. మా అన్న కారణంగా మిగిలిన దిక్పాలకులను కూడా నాశనం చేస్తాను," అంటూ కుబేరుడి దూతను కత్తితో నరికి, రాక్షసులకు తినమని ఇచ్చి, ప్రయాణ సన్నాహం చేసి, రథమెక్కి మూడు లోకాలూ జయించటానికి బయలుదేరాడు.

అతను మొట్టమొదట కుబేరుడి పైకే వెళ్ళ నిశ్చయించుకుని, మహోదరుడూ, ప్రహస్తుడూ, మారీచుడూ, శుకుడూ, సారణుడూ, ధూమ్రాక్షుడూ అనే మహాశూరులైన ఆరుగురు మంత్రులతో బయలుదేరి, కొద్ది కాలం లోనే నదులనూ, కొండలనూ, వనాలనూ దాటి, కైలాస పర్వతం చేరాడు. అక్కడ రావణుడూ, అతని అనుచరులూ కూర్చుని ఉండటం చూసి, ఆ వచ్చినవాడు కుబేరుడి తమ్ముడేనని తెలుసుకుని యక్షులు వెళ్ళి కుబేరుడితో చెప్పారు.



వెంటనే కుబేరుడు తన యక్షులను రావణుడి పైకి పంపుతూ, యుద్ధం చెయ్యమని ఉత్తరువిచ్చాడు. అసంఖ్యాకులైన యక్షులు వచ్చి, రావణుణ్ణీ, అతని మంత్రులనూ, చుట్టుముట్టి యుద్ధం ప్రారంభించారు. రావణుడి మంత్రి ప్రతి ఒక్కడూ వెయ్యేసి మంది యక్షులతో యుద్ధం చేశాడు. ఇక రావణుడు, ఎండుగడ్డిని అగ్ని దహించినట్టుగా, యక్షులను నిర్మూలించాడు. ఈ యుద్ధంలో చచ్చిన యక్షులు చావగా, మిగిలిన వారు పారిపోయారు.

ఈ సంగతి విని కుబేరుడు మరి కొందరు యక్షులను రావణుడి పైకి పంపాడు. వారిలో



సంయోధకంటకు డనే వాడు మారీచుడి పై చక్రాయుధం ప్రయోగించి, కొండపై నుంచి కిందికి పడేటట్టు కొట్టాడు. మారీచుడు తెప్పరిల్లి తన పైకి వచ్చి యుద్ధం చేసే సరికి ఆ యక్షుడు పారిపోయాడు.

అలాగే అలకానగరం లోపలికి ప్రవేశించకుండా అడ్డంగా ఉండిన ఒక యక్షుణ్ణి రావణుడు తోరణం పీకి, కొట్టి చంపేశాడు. తరవాత యక్షు లందరూ రణరంగం నుంచి పారిపోయి, నదుల లోనూ గుహల లోనూ దాక్కున్నారు.

తాను రెండోసారి పంపిన యక్షులు కూడా ఓడిపోయే సరికి కుబేరుడు మాణిభద్రు డనే మహాయక్షుణ్ణి రాక్షసుల పైకి పంపాడు. ఆ మాణిభద్రుడు నాలుగు వేల యక్షులను వెంట తీసుకుని యుద్ధం ప్రారంభించాడు. వారందరూ అనేక ఆయుధాలతో తమ మీద విరుచుకుపడే సరికి రాక్షసులు పరిగెత్తసాగారు. తరవాత ఉభయ పక్షాలకూ దొమ్మి యుద్ధం జరిగింది. ఆ దొమ్మి యుద్ధంలో ప్రహస్తుడొక వెయ్యిమంది యక్షులనూ, మహోదరుడు మరొక వెయ్యిమందినీ, మారీచుడు దారుణంగా రెండు వేల మంది యక్షలనూ చంపారు. మాయలు తెలియని యక్షులు రాక్షసుల ముందెలా నిలుస్తారు?

అయినా మాణిభద్రుడు గొప్ప యుద్ధం చేశాడు. ధూమ్రాక్షుడు తనను ముసలంతో గుండెల మీద కొట్టినా చలించక, మాణిభద్రుడు తన గద గిరగిరా తిప్పి నెత్తిన కొట్టే సరికి ధూమ్రాక్షుడు నేల కరిచాడు. అది చూసి రావణుడు మాణిభద్రుడి పైకి వచ్చాడు. మాణిభద్రుడు తన పైన మూడు శక్తులు వరసగా ప్రయోగించినా లక్ష్య పెట్టక, రావణు డతని నెత్తి మీద కొట్టాడు. ఆ దెబ్బతో మాణిభద్రుడి కిరీటం ఒక పక్కకు ఒరిగిపోయి, అతనికి పార్శ్వమౌళి అనే పేరు కూడా వచ్చేసింది.





# భద్రాయువు కథ

దాశార్ణ దేశానికి రాజు వజ్రబాహువు. ఆయన పట్టపురాణి సుమతి. వజ్రబాహువుకు సుమతి కాక ఇంకా ఇతర భార్య లుండే వారు. కొంతకాల మయాక పట్టపురాణి అయిన సుమతి గర్భవతి అయింది. అది చూసి ఓర్వలేక, ఆమె సవతు లైన ఇతర రాణులు ఆమె కేదో మందు పెట్టారు.

కాలక్రమాన సుమతి ఒక కొడుకును కన్నది. కాని తల్లికొడుకు లిద్దరూ మందు పెట్టిన కారణంగా రోగగ్రస్తులై, మంచానపడి, ఏడుస్తూ తీసుకో సాగారు. ఆ తల్లి కొడుకులు అస్తమానమూ మూలుగుతూ, ఏడుస్తూ ఉంటే వజ్రబాహు మహారాజుకు చిరాకు పుట్టుకొచ్చింది. ఆయన సుమతినీ, ఆమె కొడుకునూ అరణ్యం మధ్య వదిలి పెట్టి రమ్మని తన భటులను ఆజ్ఞాపించాడు.

రాజభటులు అరణ్యంలో దిగవిడిచిన సుమతి తన బిడ్డతో సహా ఎలాగో వైశ్యపురం చేరి, అక్కడ ఒక వైశ్యుడి యింట తల దాచుకున్నది. వైశ్యుడి భార్య సుమతికి ఎన్నో విధాల సహాయం చేసింది, కాని సుమతి కన్న బిడ్డను బతికించటం ఎవరి వల్లా కాలేదు. ఆ చంటి పిల్లవాడు ఆ వైశ్యుడి ఇంటనే చనిపోయాడు. సుమతి దుఃఖానికి మేరలేదు.

ఆమె గుండె చెరువయే లాగా ఏడుస్తుండగా అక్కడికి ఋషభయోగి అనే ఋషి వచ్చి సుమతిని తత్వజ్ఞానంతో ఊరడింప జేయాలని చూశాడు. కాని ఆమెకు తత్వ జ్ఞానం తల కెక్కలేదు. భర్త చేత వెళ్ళ గొట్టబడి దిక్కులేని దయిపోయింది. కొడుకు కోసం ఎలాగో కష్టాలు సహింతా మంటే ఇప్పుడా కొడుకు కూడా పోయాడు. అందు చేత ఆమెకు భవిష్యత్తు శూన్యంగా కనబడి, తన కొడుకుతో బాటు తాను కూడా చని పోవాలని సంకల్పించుకున్నది.

అట్ట చివరి బొమ్మ





ఋషభయోగికి సుమతి పరిస్థితి చూసి జాలి పుట్టుకొచ్చింది. ఆయన ఇంత భస్మం తీసి, చనిపోయిన బిడ్డ శరీరానికి రుద్దాడు. వెంటనే ఆ శిశువు నిద్ర లేచిన వాడి లాగా లేచి కూర్చున్నాడు. యోగి ఆ కుర్రవాడికి భద్రాయువని పేరు పెట్టి, ఆశీర్వదించాడు.

అది మొదలు భద్రాయువు ఆ వైశ్యుడి ఇంటనే, వైశ్యుడి కొడుకుతో బాటు పెరిగి, పెద్దవా డయాడు. కొంత కాల మయాక ఋషభయోగి ఆ కుర్రవాణ్ణి చూడ వచ్చి, వాడికి శివకవచ మనే మంత్రం ఉపదేశించి, చంద్రహాస మనే ఖడ్గాన్నీ, ఒక శంఖాన్నీ ఇచ్చాడు.

మరి కొంత కాలం గడిచింది. మగధ రాజు దాశార్ణ దేశం మీదికి దండెత్తి వచ్చాడు. ఉభయ పక్షాలకూ జరిగిన యుద్ధంలో దాశార్ణ రాజైన వజ్రబాహు ఓడిపోయి రాజ్యభ్రష్టు డైపోయాడు. మగధ రాజు దాశార్ణరాజ్యాన్ని ఆక్రమించాడు.

తన తండ్రి మగధరాజు చేతిలో ఓడిపోయి రాజ్యభ్రష్టు డయినా డన్న సమాచారం వైశ్యపురంలో ఉంటున్న భద్రాయువుకు తెలియ వచ్చింది. అతను చంద్రహాస మనే ఖడ్గాన్నీ, శంఖాన్నీ తీసుకుని, రథ మెక్కి, తన మిత్రుడైన వైశ్య కుమారుణ్ణి రథ సారధిగా పెట్టుకుని దాశార్ణ దేశానికి వెళ్ళాడు, దాన్ని ఆక్రమించిన మగధ సేనలతో ఒంటిగా యుద్ధం చేసి, మగధ రాజును ఓడించి, రాజ్యభ్రష్టు డైన తన తండ్రికి తిరిగి రాజ్య మిప్పించి, తాను వైశ్యపురానికి తిరిగి వెళ్ళిపోయాడు. తనకు రాజ్యం తిరిగి ఇప్పించిన వాడు తన కొడుకే నన్న సంగతి వజ్రబాహుకు తెలియదు.

చంద్రాంగదు డనే రాజుకు కీర్తిమాలిని అనే కుమార్తె ఉండేది. ఆమెకు తగిన వరుణ్ణి చూసి పెళ్ళి చెయ్యవలిసి ఉన్నది. భద్రాయువుకు చిన్నతనం లోనే ప్రాణదానం చేసి కాపాడిన ఋషభయోగి



చంద్రాంగదుడి వద్దకు వచ్చి భద్రాయువు వృత్తాంత మంతా చెప్పి, "నీ కుమార్తె అయిన కీర్తిమాలినిని భద్రాయువు కిచ్చి వివాహం చెయ్యి," అని సలహా ఇచ్చాడు.

ఆ సలహా ప్రకారం చంద్రాంగదుడు తన కుమార్తె వివాహానికి ముహూర్తం నిర్ణయించి, తన కుమార్తెను పెళ్ళాడ వలిసిందిగా ఆహ్వానిస్తూ వైశ్యపురంలో ఉన్న భద్రాయువుకు శుభలేఖ పంపాడు. ఆ ఆహ్వానం అందుకుని భద్రాయువు వచ్చి కీర్తిమాలినిని పెళ్ళి చేసుకున్నాడు.

ఆ వివాహానికి అనేక మంది ఇతర రాజులతోబాటు వజ్రబాహు కూడా వచ్చాడు. ఆయన భద్రాయువును చూసి గుర్తించి, చంద్రాంగదుడితో, "ఈ కుర్రవాడే నా శత్రువులను జయించి, పోయిన రాజ్యాన్ని తిరిగి నా కిచ్చాడు. ఎవరితను?" అన్నాడు.

"మీకు తెలియదా? ఇతను మీ కుమారుడే. మీ పెద్ద భార్య సుమతి కూడా ఇక్కడే ఉన్నది," అని చెప్పి చంద్రాంగదుడు సుమతిని పిలిపించాడు.

వజ్రబాహు తాను సుమతికీ, ఆమె కొడుక్కూ చేసిన అన్యాయం తలుచుకుని చాలా బాధపడ్డాడు. ఆయన తన భార్యనూ, కొడుకునూ, కోడలినీ తిన్నగా తన రాజధానికే తీసుకుపోయి, భద్రాయువును



రాజ్యాభిషిక్తుణ్ణి చేసేసి, తాను రాజ్యపాలన నుంచి తప్పుకున్నాడు.

భద్రాయువు రాజ్యం చేసే కాలంలో ఒక చిత్రమైన సంఘటన జరిగింది. ఒక నాడు భద్రాయువూ, కీర్తిమాలినీ వనవిహారం చేసి, ఒక చెట్టునీడన విశ్రాంతి తీసుకుంటూండగా, "రక్షించండి! రక్షించండి!" అని అరుస్తూ ఒక బ్రాహ్మణు డటుగా వచ్చాడు.

భద్రాయువు చివాలున లేచి నిలబడి చూసేసరికి ఒక స్త్రీని ఒక పెద్దపులి ఈడ్చుకు పోవటం కనబడింది. ఆ స్త్రీ భయంతో అరుస్తున్నది.

"నా భార్యను పులి పట్టుకు పోతున్నది. రక్షించండి!" అన్నాడు బ్రాహ్మణుడు.

భద్రాయువు బాణాలు ఎక్కుపెట్టి పులిని కొట్టాడు. కాని ఆ పులిని ఆ బాణాలేమీ చెయ్యలేక పోయాయి. అది ఆ బ్రాహ్మణుడి భార్యను ఈడ్చుకుంటూ కనబడ కుండా వెళ్ళిపోయింది.

"ఒక్క ఆడదాన్ని కాపాడలేని రాజువు నీవేం రాజువు? నీ చంద్రహాసం ఏది? శంఖం ఏది?" అని బ్రాహ్మణుడు భద్రాయువును నిందించాడు.

భద్రాయువు ఆ బ్రాహ్మణుడితో, "అయ్యా, క్షమించండి. మీకు కలిగిన నష్టాన్ని నివారించ లేక పోయినందుకు ఏమి పరిహారం కోరుతారో కోరండి. ఇదిగో నా భార్య, ఇదిగో నా దేహం, ఇదిగో నా దేశం! మీరు కోరుకున్నది తీసుకోండి!" అన్నాడు.

బ్రాహ్మణుడు చాలా సంతోషించి, "నాయనా, ఏమి నీ ధైర్యం! ఇదంతా నేను నిన్ను పరీక్షించటానికి కల్పించిన మాయ. నా భార్యను ఏ పులీ ఎత్తుకుపోలేదు. ఆమె ఇక్కడే ఉన్నది," అంటూ తన భార్యను పిలిచాడు. ఆమె రాజు ఎదటికి వచ్చింది. తరవాత ఆ బ్రాహ్మణ దంపతులు రాజ దంపతులను ఆశీర్వదించి తమ దారిన తాము వెళ్ళిపోయారు.



# 47. సానానగర ద్వారం

యెమెన్ ప్రాచీనకాలంలో గొప్ప నాగరికత కలిగినది. సానా దానికి ముఖ్యపట్టణం. ఆ నగరానికి 8 ద్వారాలున్నాయి. వాటిలో ఒకటి ఇక్కడ చూపబడింది. రాజభవనాలకు ఈ ద్వారం కుండానే వెళ్ళాలి. ఈ నగరాన్ని పాలించిన షీబారాణి సాలమన్‌ను చూడబోయిన కథ బైబిలులో ఉన్నది.



Photo by U. S. Khosla



బహుమతి
పొందిన వ్యాఖ్య

ప్రాణాలొడ్డే సైనికుడు

పంపినవారు:
ఎస్. డి. పాలేశ్వరి, నరసాపురం

Photo by Mohanlal Malani



బహుమతి
పొందిన వ్యాఖ్య

బాలుడు వానికి వారసుడు



పంపినవారు:
ఎస్. డి. పాలేశ్వరి, నరసాపురం

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1965 డిశెంబర్ నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ అక్టోబర్ నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ప్రాణాలొడ్డే సైనికుడు

రెండవ ఫోటో : బాలుడు వానికి వారసుడు

పంపినవారు : ఎస్. దుర్గాపాలేశ్వరి, c/o డా॥ ఎస్. అమృతాజీరావు, నరసాపురం

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at The B. N. K. Press Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# కొత్తది! చారలు గల టూత్‌పేస్టు!



# సిగ్నల్

క్రిమినిరోధక ఎఱ్ఱ చారలు గలది*

మీ నోరంతటినీ శుభ్రంగా వుంచుతుంది!

❶ మీ పళ్లను శుభ్రపరుస్తుంది ❷ మీ నోటి ఊపిరిని తాజాగా వుంచుతుంది

* ఎఱ్ఱచారల్లో హెక్సాక్లోరొఫీన్ వున్నది

క్రిమినిరోధక ఎఱ్ఱచారలుగల సిగ్నల్ టూత్‌పేస్టు మీ నోరంతటినీ శుభ్రంగా వుంచుతుంది! ఎఱ్ఱ చారలందు హెక్సాక్లోరొఫీన్ గలదు. సిగ్నల్ మీ పళ్లను శుభ్రపరుస్తుండగా.........చారలలోని హెక్సాక్లోరొఫీన్ మీ నోటి ఊపిరిని తాజాగా వుంచుతుంది. ఎందుచేతనంటే హెక్సాక్లోరొఫీన్ నోటి దుర్గంధమును కలిగించే క్రిములను తక్షణం నిర్మూలించే సురక్షక పదార్థం. ఆశ్చర్యంకాదు. సిగ్నల్ మీ నోరంతటినీ పరిశుభ్రంగా వుంచుతుంది. సిగ్నల్ యందలి ఎఱ్ఱ చారలు. నురుగ గల నురగ తాజా పిప్పరమెంటువంటి రుచి. కుటుంబములో అందరికీ ప్రీతి. నేడే సిగ్నల్ టూత్‌పేస్టు కొనండి.

...సిగ్నల్ మీ పళ్లను మరియు నోటి ఊపిరిని శుభ్రపరుస్తుంది.




హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ యొక్క విశిష్టమైన ఉత్పత్తి

లింటాస్-SG.2A-77 TL

## పాటలు పాడే బొమ్మలతో

## చిన్న పిల్లలకు పుస్తకం

రంగు రంగుల అందమైన చిన్న పిల్లలకు విద్యాబోధన చేయడమనే అంశం క్రొత్తదేమీ కాదు. ఈ బొమ్మలకు తోడు రకరకాల ధ్వనులు, ఆ ధ్వనులకు చేసే బొమ్మలు వుంటే చిన్న పిల్లలు ఇంకా త్వరగా అక్షరాలు, మాటలు నేర్చుకొన గలుగుతారు.

సంగీతయుక్తంగా పాటలు పాడుతూ, రకరకాల ధ్వనులు చేసే బొమ్మలను, ఆ బొమ్మలకు సరిపడే అక్షరాలను కలిగిన అందమైన చిన్న పిల్లల పుస్తకం ఒకటి మా కార్యాలయం చేరింది. 'అ' మొదలు 'అః' వరకూ అక్షరాలు ఇందులో వున్నాయి. ప్రతి పేజీని చేతితో నొక్కితే రకరకాల ధ్వనులు వినిపిస్తాయి. పాఠశాలకు రేపో, మాపో వెళ్ళ నున్న పిల్లలకు ఇది ఎంతో ఉపకరిస్తుంది. ఈ పుస్తకంతో ఆడుకొంటూ, బొమ్మలవైపు పదే పదే చూడడంవల్ల చిన్న పిల్లల మెద డులో అక్కడి అక్షరాలు బాగా నాటుక పోయి బాగా గుర్తుంటాయి.

ఈ పుస్తకం అధునికంగా వుంది. ఇన్ని చక్కని ఆకర్షణలు కలిగిన పిల్లల పుస్తకం రావడం తెలుగులో ఇదే ప్రథమం.

వెల రు. 1-50

హెగ్గిన్‌బాదమ్స్ ప్రైవేటు లి.
165, మౌంటు రోడ్డు, మద్రాసు-2.

# ఆల్బో-సాంగ్

## అన్ని వయసుల వారికి ఆదర్శక బలవర్ధకం

మీరు అన్నివిధాల ఆరోగ్యంగా వుండాలంటే మీకు ఆల్బో-సాంగ్ అవసరం. వృద్ధులకు, యువకులకు కూడా పటిష్ఠమైన శరీరాన్ని ఆరోగ్యాన్ని సంపాదించుటకు ప్రత్యేకమైన పదార్థాలు ఆల్బో-సాంగ్‌లో చేర్చబడ్డాయి. ఈ రోజు ప్రతి రోజూకూడా ఆల్బో-సాంగ్ తీసుకోండి. సర్వదా మీరు ఆరోగ్యంగా వుంటారు






జె. అండ్ జె. డీషేన్
హైదరాబాదు (దక్కన్).

# గొంతుగ నొప్పి?

# పెప్స్

తీసుకోండి!

పెప్స్ బిళ్లలను మెల్ల మెల్లగా చప్పరించండి. అందలి శమనకరమైన, ఆరోగ్యవంతమైన ఆవిరులను ఆస్వాదించిన వెంటనే మీకు నివారణ కలుగును... దీని వలన గొంతుగ నొప్పి మరియు రొమ్ము నందలి వాపులకు నివారణ కలుగును... దగ్గు మరియు జలుబును కలుగజేసే క్రిములను నిర్మూలించుటకు ఇది సహాయపడును. మీరు త్వరితంగానే నివారణను పొందగలరు

- ★ జలుబు మరియు గొంతుగ నొప్పికి లాభదాయకమైనది.
- ★ పిల్లలకు మరశీతమైనది.
- ★ అన్ని జనరల్ స్టోర్స్ మరియు కెమిస్టుల వద్ద దొరుకును.

# పెప్స్

శీఘ్రముగా నివారణ నొసగును.




SHBI-FP-2 TEL

ఆంధ్రప్రదేశ్ డిస్ట్రిబ్యూటర్లు : Ms. వినోద్ & కో, పోస్టు బాక్సు 148, హైదరాబాదు-12

# నేడే చూడండి

విజయా వారి

# సి.ఐ.డి.

డైరెక్షన్... చాణక్య

నిర్మాతలు... నాగిరెడ్డి · చక్రపాణి



జలుబు నొప్పులతో మీ బిడ్డను బాధపడనీయకండి

విక్స్ వేపోరబ్ తక్షణమే ఉపశమనాన్ని కలుగజేస్తుంది...
మీ బిడ్డ సులభంగా శ్వాస పీల్చుకొనుటకు సహాయపడుతుంది...
రాత్రంతా సుఖంగా నిద్రిస్తాడు

మీ బిడ్డ మంచి-చెడ్డలను చూడవలసిన బాధ్యత మీది. అందు చేత బిడ్డకు జలుబు నొప్పులు వచ్చినప్పుడు, ముక్కునుండి నీరు కారుట, కండ్లనుండి నీరుకారుట, గొంతు బొంగురు పోవుట, శ్రమతో శ్వాస పీల్చుకొనుట మొదలయిన మొదటి జలుబు చిహ్నాలు కనుపించిన వెంటనే విక్స్ వేపోరబ్‌ను పులమండి.

మీ బిడ్డ జలుబుకు విక్స్ వేపోరబ్ అత్యుత్తమమైన నివారిణి ఎందుచేతనంటే ఇది జలుబు బాధిత భాగములన్నింటిలో, ఎచ్చట జలుబు ఎక్కువగా బాధిస్తుందో, అనగా, ముక్కు, గొంతు, ఛాతీలలో చాలా గుణకరంగా పనిచేస్తుంది. మీ బిడ్డ యొక్క మృదువైన చర్మానికి ఇది చాలా మంచిది.

విక్స్ వేపోరబ్‌ను పులిమి, ఉన్ని బట్టతో కప్పి, మీ బిడ్డను సుఖంగా పరుండబెట్టండి. రాత్రంతా మీ బిడ్డ సుఖంగా నిద్రించే సమయములో విక్స్ వేపోరబ్ దాని ప్రభావాన్ని కొనసాగిస్తూ వుంటుంది. ఉదయానికల్లా అతి చెడ్డ జలుబు కూడా పూర్తిగా పోయి, మీరు అమితంగా ప్రేమించే మీ గారాబు బిడ్డ సంతోషంగా మేలుకొంటాడు.




# విక్స్ వేపోరబ్

3 సైజులలో

VV 464.

